# శ్రీ గజేంద్ర మోక్షణ సాధన

**బమ్మెఱ పోతనామాత్య ప్రణీతము**



**సంకలనం : భాగవత గణనాధ్యాయి**

# విషయ సూచిక

శీర్షిక పద్యం

ముందుమాట:

# శ్రీ గజేంద్ర మోక్షణ సాధన

## బమ్మెఱ పోతనామాత్య విరచితము

## [ప్రతిపదార్థములు, భావములు సహితము]

### ముందుమాట:

ముందుమాట:- మన తెలుగుల పుణ్యపేటి, జాతీయ మహా కవి, సహజ కవి, బమ్మెఱ పోతనామాత్యుల వారి ప్రణీతమైన శ్రీమద్భాగవతము నందలి అనేక అద్భుతమైన ఉపాఖ్యానములలో రుక్మిణీ కళ్యాణము (దశము స్కంధము - పూర్వ భాగము), గజేంద్ర మోక్షణము (అష్టమ స్కంధము), ప్రహ్లాద చరిత్ర (సప్తమ స్కంధము), వామన చరిత్ర (అష్టమ స్కంధము), కుచేలోపాఖ్యానము (దశమ స్కంధము - ఉత్తర భాగము) అను అయిదూ పంచ రత్నాలుగా బహుళ ప్రసిద్ధి పొందాయి.

ఈ గజేంద్ర మోక్షణము తెలుగులకు మిక్కిలి ప్రీతిపాత్ర మైన కథ. బహుళార్థ సాధకమైనది, మహామంత్ర పూరితమైనది

జాలతెలుగులారా! ఇట్టి రత్నాన్ని, మీరు ఆనందంగా ఆస్వాదిస్తారని అందిస్తున్నాము.

### ప్రార్థన

1

**శ్రీమ**న్నామ! పయోద

**శ్యామ!** ధరాభృల్లలామ! జగదభిరామా!

రా**మా**జనకామ! మహో

**ద్ధామ!** గుణస్తోమధామ! దశరథరామా!

టీక:- శ్రీమన్నామ = శ్రీరామ {శ్రీమన్నాముడు - శ్రీమత్ (మంగళవంతమైన) నామ (పేరు గలవాడు), రాముడు}; పయోదశ్యామ = శ్రీరామ {పయోద శ్యాముడు - పయోద (మేఘము వంటి) శ్యామ (నల్లనివాడు), రాముడు}; ధరాభృల్లలామ = శ్రీరామ {ధరాభృ ల్లలాముడు - ధరాభృత్ (రాజులలో)

లలాముడు (శ్రేష్ఠమైనవాడు), రాముడు}; జగదభిరామ = శ్రీరామ {జగదభిరాముడు - జగత్ (లోకములకు) అభి (మిక్కిలి) రాముడు (అందమైనవాడు), రాముడు}; రామాజనకామ = శ్రీరామ {రామాజన కాముడు - రామా (రమించునట్టి వారైన, స్త్రీ జన (జనులకు) కాముడు (మన్మథుని వంటివాడు, కోరబడు వాడు), రాముడు}; మహోద్ధామ = శ్రీరామ {మహోద్ధాముడు - మహా (గొప్ప) ఉద్ధాముడు (ఉద్ధరించెడివాడు), రాముడు}; గుణస్తోమధామ = శ్రీరామ {గుణస్తోమ ధాముడు - గుణస్తోమ (సుగుణములకు) ధాముడు (నెలవైనవాడు), రాముడు}; దశరథరామా = శ్రీరామ {దశరథ రాముడు - దశరథుని యొక్క కుమారుడైన రాముడు (ఆనందింప జేయువాడు), రాముడు}.

భావము:- మంగళకర మైన పేరు కలవాడా! మేఘం వంటి కాంతివంత మైన దేహం కలవాడా! రాజులలో బహు గొప్పవాడా! అఖిల లోకాలలో అందమైన వాడా! స్త్రీలకు మన్మథుని వంటి వాడా! బహు గంభీరమైన వాడా! సుగుణాలనే సంపదలకు నిలయమైన వాడా! దశరథకుమారు డైన శ్రీరామచంద్రా! అవధరించు!

## గజేంద్రమోక్షణ కథా ప్రారంభము

**2**

నీ**రా**ట వనాటములకుఁ
బో**రా**టం బెట్లు కలిగెఁ? బురుషోత్తముచే
నా**రా**ట మెట్లు మానెను?
ఘో**రా**టవిలోని భద్ర కుంజరమునకున్.

టీక:- నీరాట = మొసలి {నీరాటము -- నీటిలో చరించునది, మొసలి}; వనాటముల = ఏనుగుల {వనాటము -అడవిలో చరించునది, ఏనుగు};

కున్ = కు; పోరాటంబు = కలహము; ఎట్లు = ఏ విధముగ; కలిగెన్ = కలిగినది; పురుషోత్తముని = విష్ణుమూర్తి; చేన్ = చేత; ఆరాటమున్ = సంకటమును; ఎట్లు = ఏ విధముగ; మానెను = తీరినది; ఘోర = భయంకరమైన; అటవి = అడవి; లోని = అందలి; భద్రకుంజరమున్ = గజరాజున {గజభేదములు - 1భద్రము 2మందము 3మృగము}; కున్ = కు.

భావము:- ”నీటిలో బతుకుతుంది మొసలి. అడవిలో తిరుగుతుంది ఏనుగు. వాటిలో అది భద్రగజం. అయితే ఆ రెంటికి అసలు పోరాటం ఎందుకు జరిగింది ఎలా జరిగింది. అలా జరిగిన ఆ పోరాటంలో పురుషోత్తముడైన శ్రీహరి ఆ గజేంద్రుడి ఆరాటాన్ని ఎలా పోగొట్టి కాపాడాడు.

భాగవతం బహుళార్థ సాధక గ్రంధం. అందులో పంచరత్న ఘట్టాలలో ఒకటైన గజేంద్రమోక్షంలోని ఎత్తుగడ పద్యం ఇది. చక్కటి ఏకేశ్వరోపాసనతో కూడుకున్న ఘట్టమిది. మంచి ప్రశ్న వేస్తే మంచి సమాధానం వస్తుంది. ఇంత మంచి ప్రశ్న పరీక్షిత్తు వేసాడు కనుకనే శుకుని నుండి గజేంద్రమోక్షణం అనే సుధ జాలువారింది. ఇక్కడ పోతనగారి చమత్కారం ఎంతగానో ప్రకాశించింది. ఇందులో త్రిప్రాసం ఉంది “నీరాట, పోరాట, నారాట, ఘోరాట” అని. భాషకి అలంకారాలు అధ్భుతమైన సౌందర్యాన్ని చేకూరుస్తాయి. రెండు లేక అంత కంటే ఎక్కువ అక్షరాలు ఉన్న పదాలు మరల మరల వస్తూ అర్థ భేదం కలిగి ఉంటే అది యమకాలంకారం. ఛేకాను ప్రాసంలో పదాల మధ్య ఎడం ఉండాలి. యమకంలో ఎడం ఉడటం లేకపోడం అనే భేదం లేదు. ఇక్కడ పోతనగారు ప్రయోగించిన యమకం అనే అలంకారం అమిత అందాన్ని ఇచ్చింది. యమకానికి చక్కటి ఉదాహరణ ఇదే అని చెప్పవచ్చు. ఏనుగులు భద్రం, మందం, మృగం అని మూడు రకాలు. వాటిలో భద్రగజం దైవకార్యాదులలో వాడతారు. అట్టి భద్రగజాల కోటికి రాజట మన కథానాయకుడు గజేంద్రుడు.

అఖిలలోకేశ్వరుడు, దయాసాగరుడు ఐన శ్రీహరి మొసలి నోటికి చిక్కిన ఒక గజరాజుని ప్రాణభయంనుండి కాపాడి రక్షించాడు. ఈ అద్భుత ఘట్టంలోని "ఎవ్వనిచే జనించు. . ." మున్నగు పద్యాలన్నీ అమృతగుళికలే కదా.
రహస్యార్థం: నీరు అనగా చిత్స్వరూపి, బుద్ధి. (ప్రమాణం చిత్స్వరూపం, సర్వ వ్యాపకుడు అయిన విష్ణువే ద్రవ (జల) రూపం అయి నిస్సంశయంగా గంగారూపం పొందుతున్నాడు. అట్టి బుద్ధి రూపమే సంకల్ప రూపం పొందుతుంది. సంకల్పం మనస్సు ఒకటే. అది నీరాటము. సంకల్పం నుండి పుట్టేది కామము. వనమునకు వ్యుత్పత్తి "వన్యతే సేవ్యతే ఇతి వనం" అనగా జీవులచే సేవింపబడునది వనం. అలా కామం వనాటం. అంటే ఆత్మ యొక్క కళ అనే ప్రతిబింబం జీవుడు కదా. ఆ నీరాటమునకు మరియు వనాటం అయిన కామమునకు సంసారం అనే ఘోర అడవిలో కలహం ఎలా కలిగింది? అని ప్రశ్న. పురుషోత్తముడు అయిన విష్ణువు ఆ పోరు అనే భవదుఃఖాన్ని ఎలా తొలగించాడు? అని ప్రశ్న.

3

మునినాథ! యీ కథాస్థితి
<u>వి</u>నిపింపుము వినఁగ నాకు <u>వే</u>డుక పుట్టెన్;
వినియెదఁ గర్ణేంద్రియముల
<u>బె</u>నుఁబండువు సేయ మనముఁ బ్రీతిం బొందన్.

<u>టీక</u>:- ముని = మునులలో; నాథ = ప్రభువా; ఈ = ఈ; కథా = కథ యొక్క; స్థితిన్ = వివరమును; వినిపింపుము = చెప్పుము; వినగన్ = వినవలె నని; నా = నా; కున్ = కు; వేడుక = కుతూహలము; పుట్టెన్ = కలిగినది; వినియెదన్ = విందును; కర్ణేంద్రియముల = చెవులకు; పెను = మహా; పండువు = ఉత్సవము; చేయన్ = చేయగా; మనమున్ = మనసునకు; ప్రీతిన్ = సంతోషము; పొందన్ = కలుగగా.

భావము:- ఓ మునీంద్రా! నాకు ఈ గజేంద్రమోక్షణం కథ వినాలని కుతూహలంగా ఉంది. చెప్పు. చెవులకు పెద్దపండుగలా మనస్సుకు ప్రీతి కలిగేలా వింటాను.

రహస్యార్థం: ఈ కథాస్థితి, వృత్తాంతపు వివరాలు చెప్పమని అడుగుతున్నాడు. మామూలు కోరిక కాదు వేడుక పుట్టిందిట. పెనుపండువు అంటే మోక్షం కావాలట.

4

ఏ కథల యందుఁ బుణ్య
శ్లోకుఁడు హరి చెప్పఁబడును సూరిజనముచే
నా కథలు పుణ్యకథలని
యాకర్ణింపుదురు పెద్ద లతి హర్షమునన్.

టీక:- ఏ = ఏ; కథల = కథల; అందున్ = లో; పుణ్యశ్లోకుడు = నారాయణుడు {పుణ్యశ్లోకుడు - పుణ్యవంతులచే శ్లోకుడు (కీర్తింపబడువాడు), విష్ణువు}; హరి = నారాయణుడు గురించి; చెప్పబడును = చెప్పబడునో; సూరి = పండితులైన; జనము = వారి; చేన్ = చేత; ఆ = ఆ; కథలు = కథలు; పుణ్యకథలు = పుణ్యవంత మైన కథలు; అని = అని; ఆకర్ణింపుదురు = వింటారు; పెద్దలు = పెద్దవారు; అతి = మిక్కిలి; హర్షమునన్ = సంతోషముతో.

భావము:- పండితులు వర్ణించే విష్ణుని కథలను పుణ్యకథలు అంటారు. వాటిని పెద్దలు మిక్కిలి సంతోషంతో వింటారు కదా."

రహస్యార్థం: హరి కి వ్యుత్పత్తి "హరిర్హతి పాపాని" పాపాలను హరించు వాడు హరి. అతనే పరబ్రహ్మ. అతని కథలు అంటే బ్రహ్మజ్ఞానం. దానిని ఆకర్ణింపను తెలుసుకొనుటకు పెద్దలు జ్ఞానులు సహజంగానే ఇష్టపడతారు.

5

ఇవ్విధంబునఁ బ్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు బాదరాయణి నడిగె" నని చెప్పి సభాసదులైన మునుల నవలోకించి సూతుండు పరమహర్ష సమేతుండై చెప్పె; నట్లు శుకుండు రాజున కిట్లనియె.

టీక:- ఈ = ఈ; విధంబునన్ = విధముగ; ప్రాయోపవిష్టుండు = ప్రాయోపవేశము చేయువాడు {ప్రాయోపవేశము - మరణాంతమువరకు ఉపవాశ ముండుట (ఆహారాదులను విసర్జించుట)}; ఐన = అయిన; పరీక్షిత్ = పరీక్షిత్తు యనెడి; నరేంద్రుండు = రాజు; బాదరాయణిన్ = శుకుని; అడిగెన్ = అడిగెను; అని = అని; చెప్పి = చెప్పి; సభాసదులు = సభయం దున్నవారు; ఐన = అయిన; మునులన్ = మునులను; అవలోకించి = చూసి; సూతుండు = సూతుడు; పరమ = మిక్కిలి; హర్ష = సంతోషముతో; సమేతుండు = కూడినవాడు; ఐ = అయ్యి; చెప్పెన్ = చెప్పెను; అట్లు = ఆ విధముగ; శుకుండు = శుకుడు; రాజున్ = రాజున; కున్ = కు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఈ విధంగా తక్షక భయంతో ప్రాయోపవేశం చేపట్టిన పరీక్షిత్తు వ్యాసుని కొడుకైన శుకుణ్ణి అడిగాడు" అని చెప్పి సూతమహర్షి శౌనకాది మహర్షులకు సంతోషంగా ఇలా చెప్పాడు. "శుకుడు పరీక్షిత్తునకు ఇలా చెప్పసాగాడు.

రహస్యార్థం: తక్షకుడు సర్పం. సర్పం కాలానికి సంకేతం. తత్ క్షణ కాలానికి అంటే ఆయా లేదా తగిన కాలానికి సంకేతం అనుకోవచ్చు. తక్షకుడు కాటేయటం అంటే కాలం కాటేయటం కదా మరి. మృత్యువు అనివార్య మహారహస్యం. చేరిన వానికి కాని తెలియనిది. మరి పరీక్షిత్తు ప్రాయోపవిష్టుడు అయి ఉన్నాడు కనుక తెలిసికొన అర్హుడు కావచ్చు. ఆ పైన పరీక్షించి చూసిన వాడు కనుక అన్నిటికన్నా ఉత్తమతమము అయిన విష్ణు సాయుజ్యం అపేక్షించాడు. చిలుక మధుర ఫలాలను అందించటానిక సంకేతం. శుకుడు కావలసిన దారి వివరిస్తున్నాడు. రండి మనంకూడా విందాం. అర్హత వచ్చి వెళ్ళేటప్పుడు ముందే దారి గురించి తెలిసి ఉంటే ఎంతో సులువుగా ఉంటుంది. పరీక్షిత్తు ముముక్షువు, ప్రాయోపవిష్టుడు అయి ఉన్నాడు అనగా, జనన మరణాది వృత్తులను అభిలషించక, ఉద్యోగి కార్యాలయం కట్టేసే సమయం కోసం ఎదురు చూసేవిధంగా ప్రారబ్ధక్షయ సమయం అయిన మరణాసన్నం కోసం ఎదురు చూస్తున్నాడు. అలా పరీక్షిత్తు అపేక్షిస్తున్న సద్యోముక్తి మార్గం అను విహంగ మార్గం నిర్దేశకుడు అనుయాయి అయిన శుకుడు చెప్పసాగాడు.

## త్రికూట పర్వత వర్ణన

రాజేంద్ర! విను సుధారాశిలో నొక పర్వ;
తము త్రికూటం బనఁ దనరుచుండు;
యోజనాయుతమగు నున్నతత్వంబును;
నంతియ వెడలుపు నతిశయిల్లుఁ;
గాంచనాయస్సారకలధౌతమయములై;
మూఁడు శృంగంబులు మొనసియుండుఁ;
దట శృంగబహురత్న ధాతుచిత్రితములై;
దిశలు భూనభములుఁ దేజరిల్లు;
భూరి భూజ లతా కుంజ పుంజములును
మ్రోసి పఱతెంచు సెలయేటి మొత్తములును
మరఁగి తిరిగెడు దివ్యవిమానములును
జఱులఁ గ్రీడించు కిన్నరచయముఁ గలిగి.

టీక:- రాజ = రాజులలో; ఇంద్ర = ఉత్తముడ; విను = వినుము; సుధారాశి = పాలసముద్రము; లోన్ = అందు; ఒక = ఒక; పర్వతము = కొండ; త్రికూటంబు = త్రికూటము; అనన్ = అనగా; తనరుచున్ = అతిశయించుతు; ఉండున్ = ఉండును; యోజన = యోజనము; ఆయుతము = పొడవు; అగు = అయిన; ఉన్నతత్వంబును = ఎత్తు; అంతియ = అంతే; వెడలుపున్ = వెడల్పు; అతిశయిల్లు = అతిశయించెడి; కాంచన = బంగారము; అయస్సార = ఉక్కు; కలధౌత = వెండి; మయములు = నిండినవి; ఐ = అయ్యి; మూడు = మూడు (3); శృంగంబులు = శిఖరములు; మొనసి = కలిగి; ఉండున్ = ఉండును; తట = చరియలు; శృంగ = శిఖరము లందలి; బహు = అనేకమైన; రత్న = రత్నములచేతను; ధాతు = ఖనిజములచేతను; చిత్రితములు = రంగులు వేయబడినవి; ఐ = అయ్యి; దిశలు = దిక్కులు; భూ = భూమి; నభములున్ = ఆకాశములు; తేజరిల్లున్ = ప్రకాశించును.
భూరి = మిక్కిలి పెద్దవైన; భూజ = చెట్లు; లతా = లతలు; కుంజ = పొదరిండ్ల; పుంజములును = సమూహములును; మ్రోసి = ధ్వనించుచు; పఱతెంచు = ప్రవహించెడి; సెలయేటి = కొండవాగుల; మొత్తములును = సమూహములును; మరగి = మోహములోపడి; తిరిగెడు = వర్తించెడి; దివ్య = దివ్యమైన; విమానములునున్ =

విమానములు; చఋలన్ = కొండచరియ లందు; క్రీడించు = వినోదించెడి; కిన్నర = కిన్నరలల; చయమున్ = సమూహములును; కలిగి = ఉండి.

భావము:- “మహారాజా! పాలసముద్రంలో త్రికూట మనే పర్వతం ఉంది. దాని ఎత్తు, వెడల్పు ఒక్కొక యోజనము (4 కోసులు అంటే సుమారు 14 కిలో మీటర్లు). దానికి బంగారం వెండి ఇనుప శిఖరాలు మూడు (3) ఉన్నాయి. కొండ సానువుల లోను శిఖరాలలోను యున్నట్టి రత్నాలు ధాతువులు వలన దిక్కులు భూమి ఆకాశం చిత్రమైన రంగులతో మెరుస్తుంటాయి. దాని మీద పెద్ద పెద్ద చెట్లు తీగలు పొదలు గలగలలాడే సెలయేర్లు ఉన్నాయి. వీటికి అలవాటుపడిన దేవతలు విమానాలలో తిరుగుతుంటారు. ఆ కొండ చరియ లందు కిన్నరలు విహరిస్తుంటారు.

రహస్యార్థం: సుధారాశి, పాలసముద్రం అనగా ఇతరం ఏది చూడని, వినని, ఎరుగని, చలించని అట్టి సహజ బ్రహ్మానంద స్థితి యగు పరబ్రహ్మము అందు. యోజనోన్నతం అనగా అనంత స్వరూపం గల పొడవు వెడల్పు అనే పడుగు పేకలుగా కూర్చబడిన పరబ్రహ్మము అందు. గుణసామ్యం అగు ప్రకృతి, రజో గుణం (కాంచనం, బంగారం), తమోగుణం (అయస్సారం, ఇనుము), సత్వగుణం (కలధౌత, వెండి) అనే త్రిగుణాలతో కూడినదిగా వ్యక్తమగుచున్నది. ఆయా త్రిగుణాల ప్రతిబింబాలు అయిన బ్రహ్మ, విష్ణు, రుద్రులు అనే మూడు శృంగములచే త్రికూట పర్వతం ప్రకాశించుతున్నది. అక్కడి చరియల సూత్రాత్మ (సూర్య చంద్రాది) కాంతులచే భాసమానములు అయిన సంసారం అనే మహా వృక్షాలు, ఆశ అనే లతలచే నిర్మితమైన పొదరిళ్ళు, వాసనా ప్రవాహాలు అనే సెలయేర్లు మరిగి దివ్యవిమానాలు అనే శరీరాలు మరియు విశ్వ, తైజస, ప్రాజ్ఞులు అను కిన్నరులు తిరుగుతున్నాయి.

7

అది మఱియును మాతులుంగ, లవంగ, లుంగ, చూత, కేతకీ, భల్లాత, కామ్రాతక, సరళ, పనస, బదరీ, వకుళ, వంజుళ, వట, కుటజ, కుంద, కురవక, కురంటక, కోవిదార, ఖర్జూర, నారికేళ, సింధువార, చందన, పిచుమంద, మందార, జంబూ, జంబీర, మాధవీ, మధూక, తాల, తక్కోల, తమాల, హింతాల, రసాల, సాల, ప్రియాళు, బిల్వామలక, క్రముక, కదంబ, కరవీర, కదళీ, కపిత్థ, కాంచన, కందరాళ, శిరీష, శింశు పాశోక, పలాశ, నాగ, పున్నాగ, చంపక, శతపత్ర, మరువక, మల్లికామతల్లికా ప్రముఖ నిరంతర వసంతసమయ సౌభాగ్య

సంపదంకురిత, పల్లవిత, కోరకిత, కుసుమిత, ఫలిత, లలిత, విటప, విటపి, వీరున్నివహాలంకృతంబును; మణివాలుకానేక విమల పులినతరంగిణీ సంగత విచిత్ర విద్రుమలతా మహోద్యాన శుక పిక నికర నిశిత సమంచిత చంచూపుట నిర్ధళిత శాఖిశాఖాంతర పరిపక్వ ఫలరంధ్ర ప్రవర్షిత రసప్రవాహ బహుళంబును; కనకమయ సలిల కాసార కాంచన, కుముద, కల్హార, కమల పరిమళ మిళిత కబళాహార సంతతాంగీంకార భార పరిశ్రాంత కాంతా సమాలింగిత కుమార మత్త మధుకర విటసముదయ సమీప సంచార సముదంచిత శకుంత, కలహంస, కారండవ, జలకుక్కుట, చక్రవాక, బక, బలాక, కోయష్టిక ముఖర జలవిహంగ విసర వివిధ కోలాహల బధిరీ భూత భూనభోంతరాళంబును; తుహినకరకాంత, మరకత, కమలరాగ, వజ్ర, వైఢూర్య, నీల, గోమేధిక, పుష్యరాగ మనోహర కనక కలధౌత మణిమయానేక శిఖరతట దరీ విహరమాణ విద్యాధర, విబుధ, సిద్ధ, చారణ, గరుడ, గంధర్వ, కిన్నర, కింపురుష మిథున సంతత సరస సల్లాప సంగీత ప్రసంగ మంగళాయతనంబును; గంధగజ, గవయ, గండభేరుండ, ఖడ్గ, కంఠీరవ, శరభ, శార్దూల, శశ, చమర, శల్య, భల్ల, సారంగ, సాలావృక, వరాహ, మహిష, మర్కట, మహోరగ, మార్జాలాది నిఖిల మృగనాథ సమూహ సమర సన్నాహ సంరంభ సంచకిత శరణాగత శమన కింకరంబునై యొప్పు నప్పర్వత సమీపము నందు.

<u>టీక</u>:- అది = అది; మఱియునున్ = ఇంకను; మాతులుంగ = మాదీఫలము; లవంగ = లవంగము; లుంగ = పుల్లమాదీఫలము; చూత = మామిడి; కేతకీ = మొగలి; భల్లాతకి = జీడిమామిడి; ఆమ్రాతక = అంబాళము; సరళ = తెల్లతెగడ; పనస = పనస; బదరీ = రేగు; వకుళ = పొగడ; వంజుళ= ప్రబ్బ; వట = మఱ్ఱి; కుటజ = కొండమల్లె; కుంద = మొల్ల; కురవక = ఎఱ్ఱగోరింట; కురంటక = పచ్చగోరింట; కోవిదార = కాంచనపు చెట్లు; ఖర్జూర = ఖర్జూరము; నారికేళ = కొబ్బరి; సింధువార = వావిలి; చందన = చందనము; పిచుమంద = వేప; మందార = మందారము; జంబూ = నేరేడు; జంబీర = నిమ్మ; మాధవీ = గురివింద; మధూక = ఇప్ప; తాల = తాడి; తక్కోల = తక్కోలము; తమాల = చీకటిమానులు; హింతాల = గిరికతాడి చెట్టు; రసాల = తియ్యమామిడి; సాల = మద్ది; ప్రియాళు = మోరటి; బిల్వ = మారేడు; అమలక = ఉసిరి; క్రముక = పోక; కదంబ = కడిమి; కరవీర = గన్నేరు; కదళీ = అరటి; కపిత్థ = వెలగ; కాంచన = ఉమ్మెత్త; కందరాళ = కలజువ్వి; శిరీష = దిరిసెన; శింశుప = ఇరుగుడు; అశోక = అశోకము; పలాశ =

మోదుగ; నాగ = పొన్న; పున్నాగ = పొరపొన్న; చంపక = సంపెంగ; శతపత్ర = తామర; మరువక = మరువము; మల్లికమతల్లిక = మంచిమల్లెలు; ప్రముఖ = మొదలగు; నిరంతర = సర్వకాలము లందు; వసంత = వసంతకాల; సమయ = సమయపు; సౌభాగ్య = సౌభాగ్య; సంపత్ = సంపదలు; అంకురిత = మొలకలెత్తుచున్న; పల్లవిత = చిగుర్లు చిగురించిన; కోరకిత = మొగ్గలు తొడిగిన; కుసుమిత = పూలు పూసిన; ఫలిత = పండ్లు కాసిన; లలిత = చక్కటి; విటప = కొమ్మలు గల; విటపి = చెట్లు; వీరుత్ = పొదల; నివహ = సమూహములచే; అలంకృతంబును = అలంకరింపబడినది; మణి = మణిశిల, ఎఱ్ఱమన్ను; వాలుకా = ఇసుకలు గల; అనేక = వివిధములైన; విమల = స్వచ్ఛమైన; పులిన = ఇసుకతిన్నెలు గల; తరంగిణీ = సెలయేర్లలో; సంగత = కూడి యున్నది; విచిత్ర = రంగురంగుల; విద్రుమ = పగడాల; లతా = లతలు గల; మహా = పెద్ద; ఉద్యాన = తోట లందలి; శుక = చిలుకలు; పిక = కోయిలల; నికర = సమూహముల; నిశిత = వాడి యైన; సమంచిత = చక్కనైన; చంచూపుట = ముక్కులచే; నిర్దళిత = కొరకబడిన; శాఖి = చెట్ల; శాఖ = కొమ్మల; అంతర = అందలి; పరిపక్వ = మిగులముగ్గిన; ఫల = పండ్ల; రంధ్ర = కన్నములనుండి; ప్రవర్షిత = మిక్కిలి కారుతున్న; రస = పండ్లరసముల; ప్రవాహ = ప్రవాహముల; బహుళంబునున్ = అనేకములు గలది; కనకమయ = బంగారములాంటి; సలిల = నీటి; కాసార = సరోవరముల యొక్క; కాంచన = బంగారుకాంతితో కూడిన; కుముద = తెల్లకలువలు; కల్హార = ఎఱ్ఱకలువలు; కమల = పద్మముల; పరిమళ = సువాసనలతో; మిళిత = కూడిన; కబళాహార = మధువులతో {కబళాహారము - తినెడి ఆహారము, పూలతేనె}; సంతత = ఎడతెగక; అంగీకార = స్వీకరించుటచే; భార = బరువెక్కి; పరిశ్రాంత = అలసిన; కాంతా = ప్రియురాళ్లచే; సమాలింగిత = కొగలించుకొనబడిన; కుమార = యౌవ్వనముచే; మత్త = మదించిన; మధుకర = గండుతేనెటీగ లనెడి; విట = ప్రియుల; సముదయ = సమూహమునకు; సమీప = దగ్గరలో; సంచార = తిరుగుతు; సముదంచిత = చక్కగా నున్న; శకుంత = శకుంతలములు; కలహంస = కలహంసలు; కారండవ = కారండవములు; జలకుక్కుట = నీటికోళ్ళు; చక్రవాక = చక్రవాకములు; బక = కొంగలు; బలాక = కొక్కెరలు; కోయష్టిక = చీకుకొక్కెరలు; ముఖర = మొదలగు; జలవిహంగ = నీటిపక్షుల; విసర = సమూహముల; వివిధ = అనేకరకముల; కోలాహల = కలకలారవములతో; బధిరీభూత

= చెవుడుపడ్డ; భూ = నేల; నభో = నింగి; అంతరాళంబు = మధ్యప్రదేశము; తుహినకరకాంత = చంద్రకాంత; మరకత = పచ్చలు; కమలరాగ = కమలరాగమణులు; వజ్ర = వజ్రములు; వైఢూర్య = వైఢూర్యములు; నీల = నీలమణులు; గోమేధిక = గోమేధికమలు; పుష్యరాగ = పుష్యరాగములు; మనోహర = కమనీయమైన; కనక = బంగారము; కలధౌత = వెండి; మణి = మణులతో; మయ = నిండిన; అనేక = అనేకమైన; శిఖర = శిఖరములు; తట = కొండ చరియలు; దరీ = గుహలయందు; విహరమాణ = విహరించుచున్న; విద్యాధర = విద్యాధరుల; విబుధ = జ్ఞానుల; సిద్ధ = సిద్ధుల; చారణ = చారణుల; గరుడ = గరుడుల; గంధర్వ = గంధర్వుల; కిన్నర = కిన్నరల; కింపురుష = కింపురుషుల; మిథున = జంటల; సతత = ఎడతెగని; సరస = రసవంతమైన; సల్లాప = మంచిమాటలు; సంగీత = పాటల; ప్రసంగ = చర్చలతోను; మంగళ = శుభములకు; ఆయతనంబు = నిలయము; గంధగజ = మదపుటేనుగులు; గవయ = గురుపోతులు; గండభేరుండ = గండభేరుండపక్షులు; ఖడ్గ = ఖడ్గమృగములు; కంఠీరవ = సింహములు; శరభ = శరభమృగములు; శార్దూల = పులులు; శశ = కుందేళ్ళు; చమర = చమరీమృగములు; శల్య = ముళ్ళపందులు; భల్ల = ఎలుగుబంట్లు; సారంగ = జింక; సాలావృక = తోడేళ్ళు; వరాహ = అడవి పందులు; మహిష = దున్నపోతులు; మర్కట = కోతులు; మహోరగ = కొండ చిలవలు; మార్జాల = పిల్లులు; ఆది = మొదలగు; నిఖిల = సకల; మృగ = జంతు; సమర = పోరాటలకు; సన్నాహ = సిద్ధపడుట యందలి; సంరంభ = కోలాహలముచేత; చకిత = సంభ్రమముచెందినవారు; శరణ = రక్షణ; ఆగత = కోరెడి; శమనకింకరంబు = యమదూతలు గలది; ఐ = అయ్యి; యొప్పు = ఒప్పెడి; ఆ = ఆ; పర్వత = పర్వతమునకు; సమీపమున్ = దగ్గర; అందున్ = లో.

<u>భావము</u>:- ఆ త్రికూట పర్వతం నిండా ఎప్పుడు మాదీఫలం, లవంగం, పుల్ల మాదీఫలం, మామిడి, మొగలి, జీడిమామిడి, అంబాళం, తెల్ల తెగడ, పనస, రేగు, పొగడ, మట్టి, కొండమల్లి, కుంద, ఎఱ్ఱ గోరింట, పచ్చ గోరింట, కాంచనం, ఖర్జూరం, కొబ్బరి, వావిలి, చందనం, వేప, మందారం, నేరేడు, నిమ్మ, గురివింద, ఇప్ప, తాడి, తక్కోలం, చీకటి మాను, గిరికతాడి, తియ్యమామిడి, మద్ది, మొరటి, మారేడు, ఉసిరి, పోక, కడిమి, గన్నేరు, అరటి, వెలగ, ఉమ్మెత్త, కలజువ్వి, దిరిసెన, ఇరుగుడు, అశోక, మోదుగ, పొన్న, సురపొన్న, సంపెంగ, తామర, మరువక, మంచి మల్లె మొదలైన వసంత కాల శోభతో

అలంకరింపబడి ఉంటాయి. ఆ చెట్లు కొమ్మలు పొదలు అన్ని ఎప్పుడు చక్కగా చిగుర్లు చిగురిస్తు, రెమ్మలు పల్లవిస్తు, మొగ్గలు తొడగుతు, పూలు పూస్తు, పండ్లు కాస్తు ఉంటాయి. ఎఱ్ఱమన్ను ఇసుకలు కలిగిన అనేకమైన చక్కటి ఇసుకతిన్నెలు కల సెలయేర్లు ఉన్నాయి. ఆ చెట్ల కొమ్మలకు పండిన పండ్లను చిలుకలు కోయిలలు తమ వాడి ముక్కులతో పొడుస్తున్నాయి. ఆ పండ్ల రంధ్రాలనుండి రసాలు కారి కాలువ కాలువలుగా ప్రవహిస్తున్నాయి. ఆ కొండలో బంగారంలాంటి మంచినీటి సరస్సు లున్నాయి. వాటిలో పసుపు కలువలు, తెల్లకలువలు, ఎఱ్ఱ కలువలు, పద్మములు ఉన్నాయి, వాటి సువాసనల మధువు ఎడతెగకుండ తాగి మదించిన గండు తుమ్మెదలు తమ ప్రియురాళ్ళతో చేరి విహరిస్తున్నాయి. ఆ దగ్గరలోని చక్కటి శకుంతపక్షులు, కలహంసలు, కారండవాలు, నీటికోళ్ళు, చక్రవాకాలు, కొంగలు, కొక్కెరలు, చీకుకొక్కెరలు మొదలైన నీటిపక్షుల గగ్గోలుతో ఆకాశం నేల గింగిర్లెత్తుతోంది. చలువరాళ్ళు, మరకతాలు, వజ్రాలు, వైడూర్యాలు నీలాలు, గోమేధికాలు పుష్యరాగాలు నిండిన మనోహరమైన బంగారు వెండి శిఖరాలు చరియలు ఉన్నాయి. అక్కడ విద్యాధరులు, దేవతలు, సిద్ధులు, చారణులు, గరుడులు, గంధర్వులు, కిన్నరలు, కింపురుషులు తమ ప్రియురాళ్ళతో కలిసి జంటలు జంటలుగా విహరిస్తున్నారు. వారు రసవంతంగా మాట్లాడుతూ పాటలు పాడుతున్నారు. ఆ కొండ శుభాలకు శాశ్వతమైన అలవాలంగా ఉంది. అందులో మదపుటేనుగులు, గురుపోతులు, గండభేరుండాలు, ఖడ్గ మృగాలు, సింహాలు, శరభాలు, పులులు, కుందేళ్ళు, చమరీమృగాలు, ముళ్ళపందులు, ఎలుగుబంట్లు, జింకలు, తోడేళ్ళు, అడవిపందులు, అడవిదున్నలు, కోతులు, పెద్ద పెద్ద పాములు, పిల్లులు మొదలైన జంతువులు ఉన్నాయి. అవి ఎప్పుడు పోరాటాలు చేస్తుంటే చూసిన, యమ భటులు సైతం భయపడి శరణు వేడుతుంటారు.

రహస్యార్థం: వసంత సమయ సౌభాగ్య సంపద అనగా ఈశ్వర ధ్యానం అంకురిస్తున్న, సంసారం అనే అరణ్యంలో రాగాది పల్లవములు, విషయ పుష్పములు మొదలుగా గల వృక్షాలతో శోభాయుక్తం అయి, మోహాన్ని కలిగిస్తున్నది. ఆ సంసృతి అనే పాదపములకు బీజము అజ్ఞానం. దేహమే ఆత్మ అనెడి భావన అంకురం. లేచిగురు అనే రాగం. కర్మం అను దోహజం (జలం), కలిగిన చెట్ల వేళ్ళకు కొమ్మలకు మధ్య ఉండే కాండం స్థూలోపాధి. చివరి కొమ్మలు ఇంద్రియాలు. పుష్పములు శబ్దాది విషయములు. ఫలములు అనేక

జన్మల నుండి వస్తున్న కర్మ వాసనలచే జనించు ప్రారబ్ధానుభవాలైన దుఃఖాదులు. ఆ ఫలాల్ని అనుభవించేవి అయిన పక్షులు అను జీవులు. కలిగి ఉన్నాయి ఆ పాదపాలు. మణివాలుకానేక విమల పులినతలములు అనే రాబోవు దుఃఖాదులను మరగు పరచి తాత్కాలిక ఫలాలు అను ఆభాససుఖాలను కలిగిస్తున్నాయి. ఆయా సౌఖ్యాలను దుఃఖాలుగా గ్రహించి భక్తి జ్ఞాన ప్రవాహాలు తీరస్థ జ్ఞాన ఫల రంధ్ర స్రావకములు అనే ఆనంద రసావాదకములు శుక, పికాది పక్షులు కలిగి ఉన్నవి అగు ఆ వనాలు. భక్తి లతలు గుబురులు పుట్టి ప్రాకినవి. పుణ్యాలు అనే చివుర్లు చిగురించాయి. సచ్చిదానందం అను పుష్ప రస స్రావంతో కూడిన బ్రహ్మజ్ఞానం అనే ఫలం ఫలించింది. కనకమయ అనగా హిరణ్మయ మండలం. దాని యందలి హృత్పద్మాలు అందు నివసించే తృష్ణ సంబంధి మధుపాలు సంచరిస్తున్నాయి. మధుపాలు కనుక పైకి కిందకి అసంతుష్టిచే వ్యభిచరిస్తూ సంచరిస్తూ ఉంటాయి. సమీప సంచార నభోంతరాళ కల హంస పాలునీరు వేరు చేసి గ్రహించగల పక్షిరాజు అను పరమహంస. నామరూపాత్మక మాయాకల్పిత జగత్తు అనే నీరు వదలి. సచ్చిదానందరూప బ్రహ్మము అనే పాలు వేరు చేసి గ్రహిస్తాడు. అట్టి ద్విజ(పక్షి) శ్రేష్ఠులు పరమ హంసలు ఉన్నారు. ఇంకా లింగ శరీరాణ్యంలో ఉండే, క్రోధం అను పెద్దపులి, లోభం అనే శరభం (సింహాలను చంపే క్రూర మృగం). మోహం అనే పంచాననం (సివంగి), కామం అనే భల్లూకం (ఎలుగుబంటు), మదం అను జంబుకం (నక్క), మత్సరం అను కోక (తోడేలు, అడవి కుక్క) కలిసి చిత్తం అనే హరిణం (లేడిని) బాధిస్తున్నాయి. అట్టి త్రికూటము నందు.

8

భిల్లీ భిల్ల లులాయక
భల్లుక ఫణి ఖడ్గ గవయ వలిముఖ చమరీ
ఝిల్లీ హరి శరభక కిటి
మల్లాద్భుత కాక ఘూక మయమగు నడవిన్.

టీక:- భిల్లీ = భిల్లస్త్రీలు, చెంచితలు; భిల్ల = భిల్లులు, చెంచులు; లులాయక = అడవిదున్నలు; భల్లుక = ఎలుగుబంట్లు; ఫణి = పాములు; ఖడ్గ = ఖడ్గమృగములు; గవయ = గురుపోతులు; వలిముఖ = కొండముచ్చలు; చమరీ = చమరీమృగములు; ఝిల్లీ = ఈలపురుగు; హరి = సింహములు; శరభక = శరభమృగములు; కిటి =

సీమపందులు; మల్లాద్భుత = అద్భుతమైన కోతులు; కాక = కాకులు; ఘూక = గుడ్లగూబలు; మయము = నిండుగా యున్నది; అగు = అయిన; అడవిన్ = అడవి నందు.

<u>భావము</u>:- ఆ త్రికూటం దగ్గర ఉన్న అడవి నిండా చెంచిత స్త్రీలు, చెంచు పురుషులు, అడవి దున్నలు, ఎలుగుబంట్లు, పాములు, ఖడ్గ మృగాలు, గురు పోతులు, కొండముచ్చులు, చమరీమృగాలు, ఈలపురుగులు, సింహాలు, శరభాలు, సీమపందలు, కోతులు, కాకులు, గుడ్ల గూబలు ఉంటాయి.

రహస్యార్థం: తృష్ణ అనే చపల స్వభావ కోతులు, కామం అనే కాముకుని తీవ్ర సంకల్పం గల ఈల పురుగులు, పగ అనే రాత్రి తప్ప పగలు దృష్టి లేని గుడ్లగూబలు, కలిగి ఆత్మ దృష్టి లేక ప్రాపంచిక దృష్టి కలిగి ఉన్న సంసారం అనే అడవి అందు.

## త్రికూట మందలి గజములు

9

<u>అ</u>న్యాలోకన భీకరంబులు, జితా<u>శా</u>నేకపానీకముల్,
<u>వ</u>న్యేభంబులు కొన్ని మత్తతనులై, వ్రజ్యావిహారాగతో
<u>ద</u>న్యత్వంబున భూరి భూధరదరీ <u>ద్వా</u>రంబులందుండి సౌ
<u>జ</u>న్యక్రీడల నీరుగాలిపడి కా<u>సా</u>రావగాహార్థమై.

<u>టీక</u>:- అన్య = ఇతరులకు; ఆలోకన = చూచుటకు; భీకరంబులు = భయముగొల్పునవి; జిత = జయింపబడిన; ఆశా = దిక్కులు గల; అనేకప = ఏనుగుల; అనీకముల్ = గుంపులందలి; వన్య = అడవి; ఇభంబులు = ఏనుగులు; కొన్ని = కొన్ని; మత్త = మదించిన; తనులు = శరీరములు గలవి; ఐ = అయ్యి; వ్రజ్యా = మందలో; విహార = విహరించుటచే; ఆగత = వచ్చిన; ఉదన్యత్వంబునన్ = దప్పికతో; భూరి = మహాగొప్ప; భూధర = పర్వతముల; దరీ = గుహా; ద్వారంబుల = ద్వారములలో; ఉండి = ఉండి; సౌజన్యక్రీడలన్ = సయ్యాటలలో; నీరుగాలి = నీటిగాలికి; పడి = వశములై; కాసార = చెరువులో; అవగాహ = మునుగుటల; అర్థమై = కోసమై.

<u>భావము</u>:- ఆ అడవిలోని ఏనుగులు ఇతరులు కన్నెత్తి చూడలేనంత భయంకరమైనవి. అవి మదించిన తమ శరీరాలతో దిగ్గజాలను సైతం మించినవి. వాటిలో కొన్ని కొండగుహల

నుండి బయలు దేరాయి. చెర్లాటాలు ఆడుతు దప్పి గొన్నాయి. జల క్రీడల కోసం సరస్సులవైపు నీటిగాలి వాలు పట్టి నడిచాయి.

రహస్యార్థం: అభయం అయిన సమాధిలో యోగులు (ద్వైతులు) భయం కల్పించుకొని దుర్నిరీక్షణం అని చెప్పదగ్గ కూటస్థాది చైతన్య రూప ఏనుగులు. మూలాధారాది గుహల నుండి బయలుదేరి పరాగ్దృష్టులకు భయంకరములై దిగ్దేవతలగు ఇంద్రాదులను జయించునవి అయి సంచరిస్తున్నా యి. కర్మాది, అభాస సుఖాలు అయిన విలాసేచ్ఛలచే క్షుత్పిపాసాది షడూర్మల స్థానం అగు మనస్సు అను కాసారం (సరస్సు) కోసం బయలు దేరాయి. (ఆకలి దుప్పులు, శోక మోహములు, జరామరణములు షడూర్మలు)

10

అంధకార మెల్ల నద్రిగుహాంతర
వీథులందుఁ బగలు వెఱచి డాఁగి
యెడరు వేచి, సంధ్య నినుఁడు వృద్ధత నున్న
వెడలె ననఁగ గుహలు వెడలెఁ గరులు.

టీక:- అంధకారము = చీకట్లు; ఎల్లన్ = అన్నియు; అద్రి = కొండ; గుహా = గుహల; అంతర = అందలి; వీథుల్ = వరుసల; అందున్ = లో; పగలు = పగటిపూట; వెఱచి = భయపడి; డాగి = దాక్కొని; ఎడరు = సమయమునకై; వేచి = ఎదురుచూసి; సంధ్యన్ = సాయంకాల సంధ్యకి; ఇనుడు = సూర్యుడు; వృద్ధతన్ = సన్నగిలి; ఉన్నన్ = ఉండగా; వెడలెన్ = బయటపడినవి; అనగన్ = అన్నట్లుగ; గుహలు = గుహలనుండి; వెడలెన్ = బయలుదేరినవి; కరులు = ఏనుగులు.

భావము:- చీకట్ల గుంపులు పగలంతా భయంతో కొండగుహలలో దాక్కొని సాయం కాలం సూర్యుడి శక్తి సన్నగిల్లటం కనిపెట్టి బయటకొచ్చాయా అన్నట్లు ఆ త్రికూట పర్వతం నుండి బయలుదేరిన ఏనుగులు ఉన్నాయి.

రహస్యార్థం: బ్రహ్మజ్ఞానం ప్రకాశించే సమయంలో (పగలు) కనబడని చీకటి అనే అవిద్య కొండ గుహలు అను హదయ కుహరాలలో దాగి ఉండి, జీవుని వృత్తి బహిర్ముఖం అయినప్పుడు అవరించి నట్లు అజ్ఞానవృత్తులు బయలుదేరాయి.

11

తలఁగవు కొండలకైనను;

మలఁగవు సింగములకైన మార్కొను కడిమిం;
గలఁగవు పిడుగుల కైనను
నిల బలసంపన్న వృత్తి నేనుఁగు గున్నల్.

టీక:- తలగవు = తొలగిపోవు; కొండల్ = కొండల; కైనన్ = కి యయినను; మలగవు = తప్పుకొనవు; సింగముల్ = సింహముల; కైనన్ = కి యయినను; మార్కొనున్ = ఎదిరించుచుండును; కడిమిన్ = శౌర్యముతో; కలగవు = కలతచెందవు; పిడుగుల్ = పిడుగుల; కైనను = కి యయినను; ఇలన్ = భూమిపైన; బల = శక్తి; సంపన్న = సమృద్ధిగా నుండుటచే; వృత్తిన్ = వర్తించుటల యందు; ఏనుగుగున్నల్ = గున్న యేనుగులు.

భావము:- ఆ గుంపులోని గున్న ఏనుగులు భూలోకంలో మిక్కిలి బల సంపదతో కొండలను ఢీకొనుట కైన వెనుదీయవు. సింహాలకైన వెనుదీయ కుండ ఎదిరించి నిలబడతాయి. చివరకి పిడుగులకు కూడ బెదరవు.

రహస్యార్థం: కొండలంత కష్టాలు వచ్చినా, ధైర్యం విడనాడకుండా, కామాదులను జయించుటకు సింగము వంటి పట్టుదల కలవి అయి ఎదుర్కొంటాయి. పిడుగుల వంటి ఆపదలు మీద పడినా తట్టుకుంటాయి కాని చలించవు. అంతటి అవిద్యావృత పారమార్థిక జీవులు అవి.

12

పులుల మొత్తంబులు పొదరిండ్లలోఁ దూఱు;
ఘోరభల్లూకముల్ గుహలు సొచ్చు;
భూదారములు నేల బొఱియలలో డాఁగు;
హరిదంతముల కేఁగు హరిణచయము;
మడువులఁ జొరఁబాఱు మహిషసంఘంబులు;
గండశైలంబులఁ గపులు ప్రాఁకు;
వల్మీకములు జొచ్చు వనభుజంగంబులు;
నీలకంఠంబులు నింగి కెగయు;
వెఱచి చమరీమృగంబులు విసరు వాల
చామరంబుల విహరణశ్రమము వాయ,

భయదపరిహేల విహరించు భద్రకరుల
గాలివాఱిన మాత్రాన జాలిఁ బొంది.

టీక:- పులుల = పులుల యొక్క; మొత్తంబులు = గుంపులు; పొదరిండ్ల = పొదరిళ్ళ; లోన్ = లోనికి; దూఱున్ = దూరిపోతాయి; ఘోర = భయంకరమైన; భల్లూకముల్ = ఎలుగుబంట్లు; గుహలున్ = గుహలలోనికి; చొచ్చున్ = దూరిపోతాయి; భూదారములు = అడవి పందులు; నేల = నేలమీద నున్న; బొఱియల్ = గోతుల; లోన్ = లోపల; డాగున్ = దాక్కొనును; హరిత్ = దిక్కుల; అంతముల్ = కొనల; కిన్ = కు; ఏగున్ = పారిపోవును; హరిణ = లేళ్ళ; చయమున్ = సమూహములు; మడుపులన్ = చెరువులలో; చొరబాఱు = దూరిపోతాయి; మహిష = అడవిదున్నల; సంఘంబులున్ = గుంపులు; గండశైలంబులన్ = పెద్దరాళ్ల కొండలపైకి; కపులు = కోతులు; ప్రాకున్ = పాకుతూ పోతాయి; వల్మీకములున్ = పుట్టలలో; చొచ్చున్ = దూరిపోతాయి; వన = అడవి; భుజంగంబులున్ = పాములు; నీలకంఠంబులున్ = నెమళ్ళు; నింగి = ఆకాశమున; కిన్ = కు; ఎగయు = ఎగురుతాయి.

వెఱచి = భయపడిపోయి; చమరీమృగంబులున్ = చమరీమృగములు; విసరున్ = విసురుతాయి; వాల = తోక లనెడి; చామరంబులన్ = విసనకఱ్ఱలను; విహరణశ్రమమున్ = అలసటలు; వాయన్ = తీరునట్లు; భయద = భయావహముగ; విహరించు = తిరిగెడి; భద్రకరుల = భద్రగజముల యొక్క; గాలి = గాలి; వాఱిన = సోకినంత; మాత్రనన్ = మాత్రముచేతనే; జాలిన్ = భీతి; పొంది = చెంది.

భావము:- ఆ మదపుటేనుగులు భయంకరంగా విహరిస్తున్నాయి. వాటి గాలి సోకితే చాలు భయపడిపోయి, పులులన్నీ పొదలలో దూరుతాయి. భీకరమైన ఎలుగుబంట్లు గుహలలో దూరతాయి. అడవి పందులు గోతులలో దాక్కుంటాయి. జింకలు దిక్కులు పట్టి పోతాయి. అడవిదున్నలు మడుగుల్లో చొరబడతాయి. కోతులు కొండరాళ్ళపైకి ఎగబాకుతాయి. అడవిలోని పాములు పుట్టలలో దూరుతాయి. నెమళ్ళు ఆకాశానికి ఎగురుతాయి. సవరపు మెకాలు తమ తోకకుచ్చుల చామరాలతో ఏనుగుల శ్రమ తీరేలా విసురుతాయి.

రహస్యార్థం: బాహ్యంగా భయంకరంగా విహరించే ఏనుగులను చూసి ఇతర జంతువులు బెదురుతున్నాయి అనే చక్కటి స్వభావాలంకారం అలరిస్తుంది. కాని ఆయా జంతువుల

రహస్య సంజ్ఞా భావం తీసుకుంటే; కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సర, ఈర్ష్య మున్నగునవి వాటి అధిదేవతల యందు అణగి ఉన్నాయి అని భావం.

13

మ**ద**గజ దానామోదముఁ

గ**ద**లని తమకములఁ ద్రావి, కడుపులు నిండం

బొ**ద**లుచుఁ దుమ్మెదకొదమల

క**దు**పులు జుం జుమ్మటంచు గానము సేసెన్.

టీక:- మద = మదించిన; గజ = ఏనుగుల; దాన = కపోలమదజలము; ఆమోదమున్ = పరిమళమువలన; కదలని = స్థిరమైన; తమకములన్ = మోహములతో; త్రావి = తాగి; కడుపులు = కడుపులు; నిండన్ = నిండగా; పొదలుచున్ = పొంగిపోతూ; తుమ్మెద = తుమ్మెదల; కొదమల = పడుచుల; కదుపులు = గుంపులు; జుంజుమ్మ = జుంజుం; అటన్ = అని; అంచున్ = అనుచు; గానము = పాటలు; చేసెన్ = పాడినవి.

భావము:- పడచు తుమ్మెదల గుంపులు ఆ మదపుటేనుగుల సుగంధాల మదజల ధారలు కమ్మగా కడుపులనిండా తాగి సంతోషంతో జుం జుమ్మని పాడుతున్నాయి.

14

తే**టి** యొకటి యొరు ప్రియకును

మా**టి**కి మాటికిని నాగ మదజల గంధం

బే**టి** కని, తన్నుఁ బొందెడి

బో**టి**కి నందిచ్చు నిండు బోఁటు దనమునన్.

టీక:- తేటి = గండు తుమ్మెద; ఒకటి = ఒకటి; ఒరు = ఒక; ప్రియ = ప్రియురాలి; కును = కి; మాటికిమాటికిని = అస్తమాను; నాగ = ఏనుగుల; మదజల = మదజలస్రావముల; గంధంబు = పరిమళములు; ఏటికి = ఎందుకులే; అని = అని; తన్నున్ = తనను; పొందెడి = కూడుతున్న; బోటి = ఆడుదాని; కిన్ = కి; అందిచ్చున్ = అందించును; నిండు = పరిపూర్ణమైన; బోటుదనమునన్ = మగతనముతో.

భావము:- గండుతుమ్మెద ఒకటి తనలో క్రీడిస్తున్న ప్రియురాలైన ఒక ఆడ తుమ్మెదకి అస్తమాను ఆ ఏనుగుల మదజలం ఎందుకులే అని నిండుమగతనం అందించింది.

రహస్యార్థం: మనస్సు సమాధి స్థితిలో ఉన్న ఆనందమును మరిగి, జగదాకార వృత్తులను వదలి, సంప్రజ్ఞతా సమాధి యందలి ఆనందమును పొందింది.

15

అంగీకృత రంగ న్మా
తంగీ మదగంధ మగుచు దద్దయు వేడ్కన్
సంగీత విశేషంబుల
భృంగీగణ మొప్పె మ్రానుపెట్టెడి మాడ్కిన్.

టీక:- అంగీకృత = ఆమోదించబడిన; రంగత్ = ప్రకాశించుచున్న; మాతంగి = ఆడు ఏనుగుల; మదగంధము = మదజలము పొందినవి; అగుచున్ = అగుచు; దద్దయు = మిక్కిలి; వేడ్కన్ = ఉత్సాహముతో; సంగీత = పాటల; విశేషంబులన్ = ప్రత్యేకతలతో; భృంగీ = ఆడుతుమ్మెదల; గణము = గుంపులు; ఒప్పెన్ = చక్కగ నున్నవి; మ్రానుపెట్టెడి = కదలనివ్వని; మాడ్కిన్ = విధముగ.

భావము:- తుమ్మెద కదుపులు ఇంపైన మదగజాల మదజలగంధా లెంతో వేడుకతో ఆస్వాదిస్తూ చెవులు గింగిర్లెత్తేలా ఝుంకారం చేస్తున్నా యి.

రహస్యార్థం: “తృష్ణా హృత్పద్మషట్పదీ” (హృదయ పద్మంలో ఉండే తుమ్మెద అంటే తృష్ణ). అలా హృదయ పద్మంలో ఉండే సంకల్పాలు అను తుమ్మెదల గుంపు, మాతంగీ అంటే పరాప్రకృతి సంబంధమైన నిర్వికల్పానందంచే, నిశ్చేష్టముగా ప్రణవనాదం చేశాయి.

16

వల్లభలు పాఱి మునుపడ
వల్లభ మని ముసరి రేని వారణదానం
బొల్లక మధుకరవల్లభు
లుల్లంబులఁ బొందిరెల్ల యుల్లాసంబుల్.

టీక:- వల్లభలు = ఆడు తుమ్మెదలు; పాఱి = ఆత్రముగ పోయి; మునుపడన్ = ముందుగా; వల్లభము = ప్రియమైనది; అని = అని; ముసరి = మూగినట్లు; ఏనిన్ = అయినను; వారణ = ఏనుగుల; దానంబున్ = మదజలములను; ఒల్లక = ఆమోదించక; మధుకరవల్లభుల్ = గండు తుమ్మెదలు; ఉల్లంబులన్ = మనసులలో; పొందిరి = పొందినవి; ఎల్ల = అధికమైన; ఉల్లాసంబున్ = ఉత్సాహములను.

భావము:- ఆడతుమ్మెదలు ఆత్రంగా పోయి ప్రియులని ముసురు కొన్నాయి. మగ తుమ్మెదలు ఏనుగుల మదజల ధారలకు ఆశపడకుండా నిండుగా తమ మనసులలో సంతోషపడ్డాయి.

రహస్యార్థం: జీవులు, అవిద్యా ఉపాధులతో కూడి పృథక్కుగా ఉండే గజగంధము అను విషానందమును గైకొనక, సహజ ఆనందమును, తాదాత్మ్య ఆనందమును ఆస్వాదిస్తున్నాయి.

17

అప్పుడు.

టీక:- అప్పుడు = ఆ సమయములో.

భావము:- ఆ సమయంలో,

18

క**ల**భంబుల్ చెరలాడుఁ బల్వలము లాఘ్రాణించి మట్టాడుచున్
ఫ**ల**భూజంబులు రాయుచుం జివురు జొంపంబుల్ వడిన్ మేయుచుం
బు**లు**లం గాఱెనుపోతులన్ మృగములం బోనీక శిక్షించుచుం
గొ**ల**ఁకుల్ జొచ్చి కలంచుచున్ గిరులపై గొబ్బిళ్ళు గోరాడుచున్.

టీక:- కలభంబుల్ = ఏనుగు గున్నలు {కలభములలో విశేషములు - 1బాలము 2పోతము 3విక్కము}; చెరలాడున్ = విహరించును; పల్వలముల్ = నీళ్లు గల చిన్నపల్లము; ఆఘ్రాణించి = వాసనచూసి; మట్టాడుచున్ = తొక్కుతూ; ఫలభూజంబులున్ = పండ్లచెట్లను; రాయుచున్ = ఒరసికొనుచు; చివురు = చిగుళ్ళ; జొంపంబుల్ = గుత్తులను; వడిన్ = వేగముగా; మేయుచున్ = తింటూ; పులులన్ = పులులను; కాఱెనుబోతులన్ = అడవిదున్నలను; మృగములన్ = లేళ్ళను; పోనీక = తప్పించుకొనిపోనీకుండ; శిక్షించుచున్ = దండించుచు; కొలకుల్ = నీటిమడుగు లందు; చొచ్చి = దిగి; కలంచుచున్ = కలచువేస్తూ; గిరుల్ = కొండల; పైన్ = మీద; గొబ్బిళ్ళుగోరాడుచున్ = కుప్పిగంతులు వేయుచు {గొబ్బిళ్ళుగోరాడు - గొబ్బిళ్ళు (బాలక్రీడావిశేషము) వలె గోరాడు (ఎగురుకుంటు ఆడు)}.

భావము:- గున్నేనుగులు చెర్లాటలాడుతున్నాయి. పచ్చిక బయళ్ళని వాసన చూసి తొక్కుతున్నాయి. పళ్ళచెట్లని రాసుకు పోతు చిగుళ్ళు గబగబ మేసేస్తున్నాయి.

పులుల్ని, అడవి దున్నలని, జింకల్ని తప్పించుకు పోనీయక నిలిపి శిక్షిస్తున్నాయి. మడుగులలో దిగి కలచేస్తున్నాయి. కొండల మీద వినోదంగా విహరిస్తున్నాయి.
రహస్యార్థం: జీవులు జీవన్ముక్తి విహారాలలో ఆనందిస్తూ, మధ్య మధ్య జలభ్రాంతితో ఎండమావులను జలం అని మోసపోతూ, వివేకంతో సంసార పాదపాలను నిర్లక్షిస్తూ, విషయాది అను చివుళ్ళు భక్షిస్తూ, కామాది క్రూరమృగాల ఉద్రేకాలను అణచేస్తున్నారు.

19

తొండంబుల మదజలవృత

<u>గం</u>డంబులఁ గుంభములను <u>ఘు</u>ట్టన చేయం

గొండలు దలక్రిందై పడు

<u>బెం</u>డుపడున్ దిశలు చూచి <u>బె</u>గడున్ జగముల్.

<u>టీక</u>:- తొండంబులన్ = తొండలములలో; మదజల = మదజలములతో; వృత = నిండిన; గండంబులన్ = చెక్కిళ్ళతో; కుంభములను = కుంభస్థలములలతో; ఘుట్టనన్ = ఢీకొట్టుట; చేయన్ = చేసినచో; కొండలు = కొండలు; తలక్రింద = కిందుమీద; ఐ = అయ్యి; పడున్ = పడిపోవును; బెండుపడున్ = బ్రద్ద లగును; దిశలున్ = దిక్కులు; చూచి = చూసి; బెగడున్ = భయపడును; జగముల్ = లోకములు.

<u>భావము</u>:- తొండాలలతో మదజలం నిండిన చెక్కిళ్ళతో కుంభస్థలాలలతో ఆ మదగజాలు ఢీకొంటుంటే కొండలు తలకిందులౌతాయి దిక్కులు బద్దలౌతాయి. లోకాలు భయపడిపోతాయి. (ఎంత చక్కటి అతిశయోక్తి అలంకారం)

రహస్యార్థం: జీవుడు అహంభావంతో ఇంద్రియ వ్యాపారలకు ఆజ్ఞలను ఇచ్చే స్థానం ఆజ్ఞా చక్రం. గండస్థలం అను ఆజ్ఞా చక్రం. అందుండే మదజలం, మదించిన చలం అంటే పట్టుదల. అదే కర్తృత్వకాది అహంభావం. తొండం అంటే ఉచ్ఛ్వాసం అంటే ప్రాణాయామం. అలా ప్రాణాయామంతో అహంభావాన్ని ఘుట్టన అంటే నిరోధం చేస్తుంటే, జగములు అంటే శరీరం గగుర్పాటు పొందింది.

## గజేంద్రుని వర్ణన

20

ఎక్కడఁ జూచిన లెక్కకు

<u>నె</u>క్కువ యై యడవి నడచు <u>ని</u>భయూథములో

నొక్క కరినాథుఁ డెడతెగి
చిక్కె నొక కరేణుకోటి సేవింపంగన్.

టీక:- ఎక్కడన్ = ఎక్కడ; చూచినన్ = చూసినను; లెక్కకునెక్కువ = చాలా ఎక్కువ ఉన్నవి; ఐ = అయ్యి; అడవిన్ = అడవిలో; నడచున్ = వర్తించెడి; ఇభ = ఏనుగుల; యూధము = సమూహము; లోన్ = లోని; ఒక్క = ఒక; కరి = గజ; నాథుడు = రాజు; ఎడతెగి = విడిపోయి; చిక్కెన్ = చిక్కిపోయెను; ఒక = ఒక; కరేణు = ఆడ యేనుగుల; కోటి = సమూహము; సేవింపంగన్ = సేవిస్తుండగా.

భావము:- ఆ అడవిలో ఎక్కడ చూసినా లెక్కలేనన్ని ఏనుగులు తిరుగుతున్నాయి. వాటిలో ఒక గజేంద్రుడు విడిపోయి వెనక బడ్డాడు. ఆడఏనుగులు అనేకం సేవిస్తు అతని వెంట ఉన్నాయి.

రహస్యార్థం: సమిష్టి ఆత్మతత్వం నుండి వ్యష్టిరూపమును పొందడమే, ఆత్మ వలన ఎడబాటు పొందుట, సంసారణ్యంలో చిక్కుట, తప్పిపోవుట.

21

ఇట్లు వెనుక ముందట నుభయ పార్శ్వంబులఁ దృషార్థితంబులై యరుగుదెంచు నేనుంగు గములం గానక తెఱంగుదప్పి తొలంగుడుపడి యీశ్వరాయత్తంబైన చిత్తంబు సంవిత్తంబు గాకుండుటంజేసి తానును దన కరేణుసముదయంబును నొక్కతెరువై పోవుచు.

టీక:- ఇట్లు = ఈ విధముగ; వెనుక = వెనుకపక్క; ముందటన్ = ముందుపక్క; ఉభయ = రెండు; పార్శ్వంబులన్ = పక్కలను; తృష = దప్పిక తీర్చుకొనుటను; అర్థితంబులు = కోరునవి; ఐ = అయ్యి; అరుగుదెంచు = కూడ వచ్చుచున్న; ఏనుగు = ఏనుగుల; గములన్ = గుంపులను; కానక = చూడలేక; తెఱంగు = దారి; తప్పి = తప్పిపోయి; తొలంగుడుపడి = ఎడబాసి; ఈశ్వరాయత్తంబు = దైవవశము; ఐన = అయిన; చిత్తంబున్ = మనసు; సంవిత్తంబున్ = తెలివి గలదిగా; కాకుండుట = లేకపోవుట; చేసి = వలన; తానున్ = తను; తన = తన యొక్క; కరేణు = ఆడు యేనుగుల; సముదయంబును = గుంపు; ఒక్క = వేరొక; తెరువు = దారిపట్టినవి; ఐ = అయ్యి; పోవుచు = వెళ్ళుచు.

భావము:- ఆ గజరాజు దైవవశం చేత బుద్ధి సరిగా పనిజేయక తనకు ఎటుపక్క దప్పికతో వచ్చే ఇతర ఏనుగుగుంపులు కనబడక విడిపోయి దారితప్పాడు. తన గుంపులోని ఏనుగుల గుంపుతో వేరేదారి పట్టి పోసాగాడు.

రహస్యార్థం: జీవుడు స్వస్థానాన్ని తప్పి, అన్నమయాది కోశం అనే భౌతిక దేహంతో; జ్ఞానం, విజ్ఞానం, ప్రజ్ఞానం మున్నగు ఆవరణల ఉపాధులలతో కూడి పరిభ్రమణ శీలుడు అయ్యె.

22

పల్వలంబుల లేఁత పచ్చిక మచ్చికఁ;
జెలుల కందిచ్చు నచ్చికము లేక;
నివురుజొంపములఁ గ్రొవ్వెలయు పూఁగొమ్మలఁ;
బ్రాణవల్లభలకుఁ బాలువెట్టు;
ఘనదానశీతల కర్ణతాళంబుల;
దయితల చెమటార్చుఁ దనువు లరసి;
మృదువుగాఁ గొమ్మల మెల్లన గళములు;
నివురుచుఁ బ్రేమతో నెఱపు వలపు;
పిఱుదు చక్కట్ల డగ్గఱి ప్రేమతోడ
డాసి మూర్కొని దివికిఁ దొండంబు జాఁచు
వెద వివేకించుఁ గ్రీడించు విశ్రమించు
మత్తమాతంగ మల్లంబు మహిమతోడ.

టీక:- పల్వలంబుల = నీళ్లుగల చిన్న పల్లములలోని; లేత = లేత; పచ్చిక = పచ్చిగడ్డి పరకలను; చెలుల్ = ప్రియురాండ్ర; కున్ = కు; అందిచ్చున్ = అందించును; అచ్చికము = కొరత; లేక = లేకుండగ; ఇవురు = చిగుళ్ళు; జొంపములన్ = గుత్తులను; క్రొవ్వెలయు = అధికముగ పూసిన; పూ = పూవులతో నున్న; కొమ్మలన్ = కొమ్మలను; ప్రాణ = ప్రాణములతో సమానమైన; వల్లభల్ = భార్యల; కున్ = కు; పాలువెట్టు = పంచిపెట్టును; ఘన = అత్యధికముగ; దాన = మదజలముచే; శీతల = చల్లగా నున్న; కర్ణ = చెవులనెడి; తాళంబులన్ = విసనకఱ్ఱలతో; దయితల = భార్యల; చెమటన్ = చెమటను; ఆర్చున్ = ఆరబెట్టును; తనువుల్ = దేహములను; అరసి = చూసి; మృదువుగా =

మెల్లగా; కొమ్ములన్ = దంతములతో; మెల్లన = మృదువుగా; గళములున్ = మెడలను; నివురుచున్ = రాయుచు; ప్రేమ = ప్రీతి; తోన్ = తోటి; నెఱపు = సాగించును; వలపు = వలపులను.
పిఱుదు = పిఱ్ఱల; చక్కట్ల = భాగముల; డగ్గఱి = దగ్గరకు; ప్రేమ = ప్రీతి; తోడన్ = తోటి; డాసి = చేరి; మూర్కొని = వాసనచూసి; దివి = ఆకాశము; కిన్ = మీదికి; తొండంబున్ = తొండమును; చాచున్ = చాచును; వెద = పశుఋతుధర్మమును; వివేకించున్ = తరచిచూచును; క్రీడించున్ = విహరించును; విశ్రమించున్ = విశ్రాంతి తీసుకొనును; మత్త = మదించిన; మాతంగ = ఏనుగు; మల్లంబు = శ్రేష్ఠము; మహిమ = గొప్పదనముతోటి.
భావము:- అప్పుడా గజేంద్రుడు బల్లిదుడై తన ప్రియురాళ్ళకి నీటి గుంటల పక్కన ఉండే లేతపచ్చికలు మచ్చికతో అందిస్తోంది. చిగుళ్ళు పూలకొమ్మల గుత్తులు పంచిపెడుతోంది. మదజలంతో తడిసిన విసనకఱ్ఱల్లాంటి పెద్దపెద్ద చెవులతో వాటి చెమటలు ఆర బెడుతోంది. వాటి మెడలకింద మెల్లగా తన దంతాలతో గోకుతు వలపుల ప్రేమ చూపుతుంది. వాటి వెనక్కి ప్రేమగా చేరి వాసన చూసి తొండాన్ని పైకెత్తి ఆకాశానికి చాచి ఋతు సమయాన్ని గుర్తిస్తోంది. క్రీడించి విశ్రమిస్తోంది.
రహస్యార్థం: బలిష్టమైన ఆ గజరాజు అను జీవుడు తన ప్రియురాలు అనగా మనస్సునకు సంతోషం కలిగించాలి అని, ఇంద్రియ విషయాలను నేరవేరుస్తూ, వృత్తులు అనే దంతాలతో అవిద్యను ఆనందింపజేస్తూ ఉన్నాడు.

23

తన కుంభముల పూర్ణతకు డిగ్గి యువతుల;
కుచములు పయ్యెదకొంగు లీఁగఁ;
దన యానగంభీరతకుఁ జాల కబలల;
యానంబు లందెల నండగొనఁగఁ;
దన కరశ్రీఁ గని తలఁకి బాలల చిఱు;
దొడలు మేఖలదీప్తిఁ దోడు పిలువఁ;
దన దంతరుచి కోడి తరుణుల నగవులు;
ముఖచంద్ర దీప్తుల ముసుఁగు దిగువఁ;

ద్రనదు లావణ్యరూపంబుఁ ద్రలఁచిచూఁడ
నంజనాభ్రము కపిలాది హరిదిభేంద్ర
ద్రయిత లందఱుఁ దనవెంటఁ ద్రగిలినడవఁ;
గుంభివిభుఁ డొప్పె నొప్పులకుప్ప బోలె.

టీక:- తన = తన; కుంభముల = కుంభముల యొక్క; పూర్ణత = నిండుదనమున; కున్ = కు; డిగ్గి = ఓడిపోయి; యువతుల = స్త్రీల; కుచములు = వక్షోజములు; పయ్యెద = పమిట; కొంగులు = కొంగులందు; ఈగన్ = చొరబడగ; తన = తన; యాన = నడకల; గంభీరత = గంభీరత; కున్ = కు; చాలక = సాటిరాలేక; అబలల = స్త్రీల; యానంబుల్ = నడకలు; అందెలన్ = కాలి యందెలను; అండకొనగ = సహాయము పొందగ; తన = తన; కర = తొండము యొక్క; శ్రీన్ = సౌందర్యమును; కని = చూసి; తలకి = చలించిపోయి; బాలల = పిల్లల; చిఱు = చిన్ని; తొడలు = తొడలు; మేఖల = బంగారు మొలతాళ్ళు; దీప్తిన్ = కాంతులను; తోడు = సహాయమును; పిలువన్ = అర్థించగ; తన = తన; దంత = దంతముల; రుచికిన్ = కాంతులకు; ఓడి = సాటిరాలేక; తరుణుల = స్త్రీల; నగవులు = నవ్వులు; ముఖ = మొహము యనెడి; చంద్ర = చంద్రుని; దీప్తులన్ = కాంతులను; ముసుగుదిగువన్ = ముసుగువేసికొనగ; తనదు = తన యొక్క.
లావణ్య = సుందరమైన; రూపంబున్ = రూపమును; తలచి = భావించికొని; చూడన్ = చూచుటకు; అంజన = ఈశాన్య దిగ్గజము భార్య అంజనావతి {అంజనావతి ఆది - దిగ్గజముల భార్యలు, 1తూర్పు అభ్రము 2ఆగ్నేయము కపిల 3దక్షిణము పింగళ 4నైఋతి అనుపమ 5పడమర తామ్రపర్ణి 6వాయవ్యము శుభ్రదంతి 7ఉత్తరము అంగన 8ఈశాన్యము అంజనావతి}; అభ్రము = తూర్పు దిగ్గజము భార్య; కపిల = ఆగ్నేయ దిగ్గజము భార్య; ఆది = మొదలగు; హరిదిభేంద్ర = దిగ్గజముల {హరిదిభేంద్రము - హరిత్ (దిక్కు లందలి) ఇభ (గజము) ఇంద్రము (శ్రేష్ఠమైనది), దిగ్గజము}; దయితలు = భార్యలు; అందఱున్ = ఎల్ల; తన = తన; వెంటదగిలి = వెంటబడి; నడవన్ = రాగా; కుంభి = గజ; విభుడు = రాజు; ఒప్పెన్ = చక్కగా ఉండెను; ఒప్పులకుప్ప = అందాలరాశి; పోలెన్ = వలె;

భావము:- గజేంద్రుని కుంభస్థలాల నిండుదనానికి సరితూగలేక లోకం లోని స్త్రీల స్తనాలు పైటకొంగుల మాటు కోరాయి. అతని నడకల ఠీవికి సరితూగలేక అతివల పాదాలు అందెల

అండ తీసుకొన్నాయి. అతని తొండం సిరికి తూగలేక కన్నెల చిన్ని తొడలు ఒడ్డాణాల కాంతులను తోడు తెచ్చుకొన్నాయి. అతని దంతాల కాంతికి సరితూగలే నందుకే ఉవిదల చిరునవ్వులు ముఖ చంద్రకాంతుల ముసుగు వేసుకొన్నాయి. అతని లావణ్య స్వరూపాన్ని చూడగోరి అంజనావతి, అభ్రమువు, కపిల మొదలైన దిగ్గజాల భార్యలు వెంటబడ్డాయా అన్నట్లు ఆడ ఏనుగులు అనుసరిస్తుండగా ఒప్పులకుప్పలా ఆ గజరాజు ఒప్పి ఉన్నాడు. (చక్కటి స్వభావోక్తి అలంకారం ఆస్వాదించండి)
రహస్యార్థం: గజేంద్రుడు అను జీవుడు పంచకోశయుక్తుడు అయీ; సప్తధాతువులతోనూ, బహిరంతర ఇంద్రియాలతోనూ, దశవిధ ప్రాణాలతోనూ, శబ్దాది విషయాలతోనూ; శరీరత్రయాన్వితుడు అయీ; అవిద్య అనే కన్యకతో పరిణయం కోసం అలంకృతుడైన పెళ్ళికొడుకులా కనబడుతున్నాడు.

24

మఱియు నానాగహన విహరణ మహిమతో మదగజేంద్రంబు మార్గంబుఁ దప్పి, పిపాసాపరాయత్త చిత్తంబున మత్తకరేణువుల మొత్తంబునుం దానునుం జని చని.

టీక:- మఱియున్ = ఇంకను; నానా = అనేకమైన; గహన = అడవుల యందు; విహరణ = సంచరించుటలు; మహిమ = అధిక్యము; తోన్ = తోటి; మద = మదించిన; గజ = ఏనుగు; ఇంద్రము = శ్రేష్ఠము; మార్గంబున్ = దారి; తప్పి = తప్పిపోయి; పిపాసా = దప్పికకు; పరాయత్త = లోబడిన; చిత్తంబునన్ = మనసుతో; మత్త = మదించిన; కరేణువుల = ఆడ యేనుగుల; మొత్తంబునున్ = సమూహము; తానున్ = తను; చనిచని = ప్రయాణంబు సాగించి;

భావము:- ఇంకా గజరాజు అనేక అడవులలో తిరిగిన ఆయాసం వలన దప్పికతో స్వాధీనం తప్పిన మనస్సుతో దారి తప్పాడు. అలా ఆడ ఏనుగులు అన్నిటితోపాటు చాలా దూరం వెళ్ళాడు.

రహస్యార్థం: జీవుడు పునరపి జననం అనుకుంటూ అనేక జన్మలు పొందడానికి సిద్ధపడి, నివృత్తి మార్గం నుండి తప్పిపోయి, ప్రవృత్తి మార్గంలో ప్రవేశించాడు

25

అ**ట**ఁ గాంచెం గరిణీవిభుండు నవఫుల్లాంభోజకల్హారమున్
న**ట**దిందిందిర వారముం, గమఠ మీనగ్రాహ దుర్వారమున్,

వట హింతాల రసాల సాల సుమనో వల్లీకుటీతీరముం,
జటులోద్ధూత మరాళ చక్ర బక సంచారంబుఁ గాసారమున్.

టీక:- అటన్ = అక్కడ; కాంచెన్ = చూచెను; కరణీ = గజ; విభుండు = రాజు; నవ = తాజా; పుల్ల = విచ్చుకొన్న; అంభోజ = కమలములు; కల్హారమున్ = కలువలు; నటత్ = ఆడుతున్న; ఇందిందిర = తుమ్మెదల; వారమున్ = సమూహము కలిగినది; కమఠ = తాబేళ్ళు; మీన = చేపలు; గ్రాహ = మొసళ్ళుతోను; దుర్వారమున్ = నివారింపరానిది; వట = మఱ్ఱి; హింతాల = తాడి; రసాల = తియ్యమామిడి; సాల = మద్ది; సుమనో = పువ్వుల; వల్లి = లతా; కుటీ = కుంజములు గల; తీరమున్ = గట్లు కలిగిన; చటుల = మిక్కిలి వేగముగా; ఉద్ధూత = ఎగిరెడి; మరాళ = హంసలు; చక్ర = చక్రవాకములు; బక = కొంగల; సంచారంబున్ = విహరించుటలు కలిగినది; కాసారమున్ = మడుగును.

భావము:- అక్కడ ఒకచోట గజేంద్రుడు ఒక మడుగుని చూసాడు. ఆ చెరువులో కొత్తగా విచ్చుకున్న కమలాలు ఉన్నాయి. అక్కడ తుమ్మెదల గుంపులు తిరుగుతున్నాయి. అది తాబేళ్ళు చేపలు మొసళ్ళుతో దాటరానిదిగా ఉంది. దాని గట్టు మీద మఱ్ఱి, తాడి, మామిడి, మద్దిచెట్లు పూల తీగలు ఉన్నాయి. ఇంకా హంసలు, చక్రవాకాలు, కొంగలు విహరిస్తున్నాయి.

రహస్యార్థం: కరణీ విభుడు అంటే అంతకరణుడూ, ముఖ్య అహంకార విషయుడు అగు పారమార్థిక జీవుడు. ఆ జీవుడు నవపుల్లాంభోజ అను అనాద్యవిద్యా వాసనలతో పరిమళించే హృదయ కమలాల వలన వికాసం పొందిన తుమ్మెదలు అను తృష్ణ పరంపర. క్షణ క్షణం పాతాళం, అంతరిక్షం, దిగంతాలు పట్టి తిరుగుతూ ఉంటుంది. అలాంటి సంకల్ప బావ పరిగళితమైనట్టి తృష్ణ అను తుమ్మెదలు కల లోభం, మోహం, కామం మున్నగు వాటిచే నివారించబడే జలచరాలు కలది, సుమనో వల్లి కుటీర తీరం అంటే శుద్ధసాత్వికం అను కుటీర తీరం. భయకారణాలైన మోహం, అసూయ, దర్పం మొదలైనవాటితో చలించిపోచున్న కాసారాన్ని చూశాడు.

## గజేంద్రుని కొలను ప్రవేశము

26

ఇట్లనన్య పురుష సంచారంబై నిష్కళంకంబైన యప్పంకజాకరంబుఁ బొడగఁని.

టీక:- ఇట్లు = ఈ విధముగ; అనన్యపురుషసంచారంబు = ఎవరు దరిజేరనిది {అనన్యపురుషసంచారము - అనన్య(అనితరమైన) పురుష (వారి) సంచారము (సంచారము గలది), ఎవరు దరిజేరనిది}; ఐ = అయ్యి; నిష్కళంకంబు = నిర్మలము; ఐన = అయిన; ఆ = ఆ; పంకజాకరంబున్ = తామరకొలనును; పొడగని = చూసి;

భావము:- ఆ మదగజాలు, ఇతరులు ఎవరు తిరగని ఆ నిర్మలమైన పద్మాల సరస్సును చూసాయి.

రహస్యార్థం: ఇలా ఏకాంతం, నిస్సంకల్పం, విశుద్ధం అయి ఉన్న ఆ మానస సరోవరం చూసి,

27

తోయజగంధంబుఁ దోఁగిన చల్లని;
మెల్లని గాడ్పుల మేను లలరఁ
గమల నాళాహార విమలవాక్కలహంస;
రవములు చెవుల పండువులు చేయ
ఫుల్లదిందీవరాంభోరుహా మోదంబు;
ఘ్రాణరంధ్రంబుల గారవింప
నిర్మల కల్లోల నిర్గతాసారంబు;
వదన గహ్వరముల వాడు దీర్పఁ
త్రిజగ దభినవ సౌభాగ్య దీప్తమైన
విభవ మీక్షణములకును విందు చేయ
నరిగి, పంచేంద్రియ వ్యవహారములను
మఱచి మత్తేభయూధంబు మడుఁగుఁ జొచ్చె.

టీక:- తోయజ = పద్మముల; గంధంబున్ = పరిమళములో; తోగిన = మునిగిన; చల్లని = చల్లని; మెల్లని = మెల్లని; గాడ్పులన్ = గాలులవలన; మేనుల్ = దేహములు; అలరన్ = హాయిగొనగా; కమల = తామర; నాళ = తూళ్ళను; ఆహార = తినుటచే; విమల = స్వచ్ఛమైన; వాక్ = పలుకుల; కలహంస = కలహంసల; రవములు = శబ్దములు; చెవుల = చెవులకు; పండువులు = పండుగలు; చేయన్ = చేయుచుండగ; పుల్లత్ = తెల్ల; ఇందీవర = కలువల; అంభోరుహ = పద్మముల; ఆమోదంబు = సువాసనలు; ఘ్రాణ = ముక్కు; రంధ్రంబులన్ = కన్నములను; గారవింపన్ = తృప్తిగలిగించగ; నిర్మల =

స్వచ్ఛమైన; కల్లోల = అలలనుండి; నిర్గత = వెలువడిన; ఆసారంబున్ = నీటితుంపరుల జడి; వదన = నోరు యనెడి; గహ్వరముల = గుహల; వాడు = దప్పిక; తీర్పన్ = తీర్చగా.

త్రిజగత్ = ముల్లోకములకు; అభినవ = సరికొత్త; సౌభాగ్య = సొగసులో; దీప్తము = కాంతివంతము; ఐన = అయిన; విభవము = వైభవము; ఈక్షణముల్ = కన్నుల; కునున్ = కు; విందు = వేడుక; చేయన్ = చేయగ; అరిగి = వెళ్ళి; పంచేంద్రియ = జ్ఞానేంద్రియము లైదింటి {పంచేంద్రియములు - 1త్వక్ 2శ్రోత్ర 3 ఘ్రాణ 4జిహ్వ 5చక్షువులు}; వ్యవహారములను = వర్తనలు; మఱచి = మరిచిపోయి; మత్త = మద; ఇభ = గజముల; యూథంబు = గుంపు; మడుగున్ = సరోవరమునందు; చొచ్చెన్ = ప్రవేశించెను.

<u>భావము</u>:- ఇతరులు ఎవరు తిరగని ఆ నిర్మలమైన పద్మాల సరస్సును చూసిన ఆ మదగజాలు, వాటి దేహాలకి పద్మాల వాసనల తో కూడిన చల్లని పిల్లగాలులు హాయి కలిగించాయి. తామర తూళ్ళు తిన్న రాయంచల కలకలారావాలు చెవులపండుగ చేస్తున్నాయి. విరిసిన తెల్ల కమలాలు కలువల సువాసనలు ముక్కులకు తృప్తి కలిగిస్తున్నాయి. స్వచ్ఛమైన అలలనుండి వెలువడిన నీటి తుంపరలు దప్పిక తీరుస్తున్నాయి. ముల్లోకాలకి సరికొత్త సౌభాగ్యాన్ని పుట్టించే ఆ సరస్సు యొక్క శోభ కళ్ళకి ఆనందం కలిగిస్తోంది. దాంతో ఆ మత్తేభాలు తమ పంచేంద్రియ జ్ఞానాలను మరచి ఆ మడుగులోకి దిగాయి.

రహస్యార్థం: ఇలా ఏకాంతం, నిస్సంకల్పం, విశుద్ధం అయి ఉన్న ఆ మానస సరోవరం చూసి, పూర్వకృత సత్ వాసనలతో స్థూల, సూక్ష్మ కారణ శరీరత్రయం అలరారుతుండగా; గుటీచక, బహూదక, హంస, పరమ హంస (ఆశ్రమ విశేషాలు) సన్యాసులలో శ్రేష్ఠులు అయిన పరమ హంసల బ్రహ్మ విచారణా, శ్రవణా ఆనందాలు కలుగగా; శుద్ధ సాత్విక మగు వృత్తుల (ప్రాణాయామ శ్వాసలు) చేత నాసికా రంధ్రాలు పూర్ణీభవించగా; సత్సంకల్ప కల్లోల (పరిణామ) జలాలచేత జిహ్వ చాపల్యం శాంతించగా; అవస్థా త్రయంతో కూడి ఉండే ఇంద్రియ వ్యాపారాల అధిదేవతలను ఆయత్త పరచి; మానస కాసారం ప్రవేశించాడు.

28

తొండంబులఁ బూరించుచు

<u>గ</u>ండంబులఁ జల్లుకొనుచు, <u>గ</u>ళగళరవముల్

మెండుకొన వలుఁదకడుపులు
నిండన్ వేదండకోటి నీటిం ద్రావెన్.
టీక:- తొండంబులన్ = తొండములలోనికి; పూరించుచున్ = నీళ్ళు పీల్చి నింపుతూ; గండంబులన్ = గండఫలకములపై; చల్లుకొనుచు = చల్లుకొంటు; గళగళ = గడగడ మనెడి; రవముల్ = శబ్దములు; మెండుకొనన్ = అతిశయించుతుండగ; వలుద = విశాలమైన; కడుపులు = పొట్టలు; నిండన్ = నిండగ; వేదండ = ఏనుగుల; కోటి = సమూహము; నీటిన్ = నీటిని; త్రావెన్ = తాగినవి.
భావము:- ఆ ఏనుగుల గుంపు తొండాల నిండా నీళ్ళు నింపుకొని చెక్కిళ్ళ మీద జల్లుకొన్నాయి. గట్టిగా గళగళ మని చప్పుళ్ళు చేస్తూ తమ పెద్ద పెద్ద కడుపులు నిండా నీళ్ళు తాగాయి.
రహస్యార్థం: జీవుడు కామంచే ఆకర్షింపబడకుండా ఉన్నంత వరకూ అవిద్యావశుడు అయి ఉన్నప్పటికీ, ఆత్మానుసంధాన పరుడు అయి ఉంటాడు. ఎలా అంటే, నేను బ్రహ్మం అయ్యాను అనే వృత్తి (జ్ఞానం) పూరకం అంటారు అదే తొండాలతో పూరించటం. అట్టి వృత్తిచేత వాయువును, ఆజ్ఞ యందు నిలుపుతూ దశవిధ నాదానుసంధానం (గళగళ రవాలు), వాయువును కుంభించి, పూరించి (కడుపులు నిండన్), నిశ్చలత్వంతో మానసకాసారంలో తాదాత్మాకార వృత్తులతో ఉన్నాడు.
29
అప్పుడు.
టీక:- అప్పుడు = అప్పుడు.
భావము:- ఆ సమయంలో,
30
ఇభలోకేంద్రుఁడు హస్తరంధ్రముల నీరెక్కించి, పూరించి, చం
డభ మార్గంబున కెత్తి, నిక్కి, వడి నుడ్డాడించి పింజింప నా
రభటిన్ నీరములోనఁ బెల్లెగసి నక్రగ్రాహ పాఠీనముల్
నభమం దాడెడు మీన కర్కటములన్ బట్టెన్ సురల్ మ్రాన్పడన్.
టీక:- ఇభలోకేంద్రుడు = గజేంద్రుడు {ఇభలోకేంద్రుడు - ఇభ (ఏనుగుల) లోక (సమూహమునకు) ఇంద్రుడు (పతి), గజేంద్రుడు}; హస్త = తొండముల; రంధ్రములన్ =

కన్నములలోనికి; నీరు = నీటిని; ఎక్కించి = పీల్చుకొని; పూరించి = నింపుకొని; చండభమార్గంబున్ = ఆకాశముపై {చండభమార్గము - సూర్యుని మార్గము, ఆకాశము, పైపైపు}; కిన్ = కి; ఎత్తి = ఎత్తి; నిక్కి = సాచి; వడిన్ = వేగముగ; ఉడ్డాడించి = పుక్కిలించి; పింజింపన్ = చిమ్మగా; ఆరభటిన్ = పెద్ద శబ్దములో; నీరము = నీటి; లోనన్ = లోనుండి; పెల్లు = పెల్లుమని, తీవ్రముగ; ఎగసి = ఎగిరి; నక్ర = పీతలు; గ్రాహ = మొసళ్ళు; పాఠీనముల్ = చేపలు; నభము = ఆకాశమందు; ఆడెడు = తిరిగెడు; మీన = మీనరాశి; కర్కటములన్ = కర్కాటకరాశులను; పట్టెన్ = పట్టుకొన్నవి; సురల్ = దేవతలు; మ్రాన్పడన్ = నిశ్చేష్టులుకాగా.

<u>భావము</u>:- ఆ సమయంలో, గజరాజు తొండంలోకి నీళ్ళు పీల్చు కొన్నాడు. ఆకాశం కేసి తొండాన్ని ఎత్తి, నిక్కించి పుక్కిలించి ఆ నీటిని వేగంగా పైకి చిమ్మాడు. ఆ వడికి ఆ నీటితో పాటు పై కెగసిన పీతలు, మొసళ్ళు, చేపలు ఆకాశంలో తిరిగే మీనరాశిని, కర్కాటకరాశిని పట్టుకొన్నాయి. దేవతలు అది చూసి ఆశ్చర్య చకితులు అయ్యారు.

రహస్యార్థం: ఇలా జీవుడు మానససరస్సులోని సంకల్పాలను పరిపక్వ స్థితిని కలచివేస్తుంటే, ఈశ్వరుడిలోని సూక్ష్మవృత్తులలో ఐక్యం అయ్యేడు.

31

మఱియు న గ్గజేంద్రంబు నిరర్గళవిహారంబున.

<u>టీక</u>:- మఱియున్ = ఇంకను; ఆ = ఆ; గజేంద్రంబు = గజేంద్రుడు; నిరర్గళ = అడ్డులేని; విహారంబునన్ = విహరించుటలో.

<u>భావము</u>:- మరి ఆ సరోవరంలో గజేంద్రుడు అడ్డులేకుండా విహరించ సాగాడు.

32

<u>క</u>రిణీకరోజ్ఝిత <u>కం</u>కణచ్ఛటఁ దోఁగి;
<u>సె</u>లయేటి నీలాద్రి <u>చె</u>లువుఁ దెగడు
<u>హ</u>స్తినీ హస్త వి<u>న్య</u>స్త పద్మంబుల;
<u>వే</u>యిగన్నులవాని <u>వె</u>రవు సూపుఁ
<u>గ</u>లభసముత్కీర్ణ <u>క</u>ల్హార రజమునఁ;
<u>గ</u>నకాచలేంద్రంబు <u>ఘ</u>నతఁ దాల్చు
<u>గుం</u>జరీ పరిచిత <u>కు</u>ముద కాండంబుల;

ఫణిరాజ మండన ప్రభ వహించు
మదకరేణు ముక్త మౌక్తిక శుక్తుల
మెఱుఁగు మొగిలుతోడ మేలమాడు
నెదురులేని గరిమ నిభరాజ మల్లంబు
వనజగేహకేళి వ్రాలునపుడు.

టీక:- కరణీ = ఆడ యేనుగుల; కర = తొండములచేత; ఉత్+జిత = చిమ్మబడిన; కం = నీటి; కణ = బిందువుల; ఛటన్ = ధార లందు; తోగి = తడసిపోయి; సెలయేటి = సెలయేళ్ళతో కూడిన; నీలాద్రి = నీలగిరి; చెలువున్ = వలె; తెగడున్ = పరిహసించును; హస్తినీ = ఆడు ఏనుగుల; హస్త = తొండములచేత; విన్యస్త = ఉంచబడిన; పద్మంబులన్ = పద్మములతో; వేయిగన్నులవాని = ఇంద్రుని {వేయికన్నులవాడు - వెయ్యి కన్నులు గలవాడు, సహస్రాక్షుడు, ఇంద్రుడు}; వెరవు = అతిశయమును; చూపున్ = చూపించును; కలభ = గున్న యేనుగులచే; సమ = అధికముగ; ఉత్కీర్ణ = జల్లబడిన; కల్హారరజమునన్ = కలువల పుప్పొడితో {కల్హారము - సౌగంధికము, ఇంటుక ఎఱుపు తెలుపు కలిగి మిక్కిలి పరిమళము కలిగిన కలువ}; కనకాచలేంద్రంబు = మేరుపర్వతము యొక్క {కనకాచలేంద్రము - కనక (బంగారు) ఆచల (కొండలలో) ఇంద్రము (గొప్పది), మేరుపర్వతము}; ఘనతన్ = గొప్పదనమును; తాల్చున్ = ధరించును; కుంజరీ = ఆడ యేనుగులచే; పరిచిత = సమర్పించిన; కుముద = తెల్ల కలువల; కాండంబులన్ = తూళ్ళతో; ఫణిరాజమండన = పరమశివుని {ఫణిరాజమండనుడు - ఫణి (సర్పములలో) రాజ (శ్రేష్ఠములచే) మండన (అలంకరింపబడిన వాడు), శివుడు}; ప్రభన్ = ప్రకాశమును; వహించున్ = ధరించును.

మద = మదించిన; కరేణు = ఆడయేనుగులచే; ముక్త = వేయబడిన; మౌక్తిక = ముత్యపు; శుక్తులన్ = చిప్పలతో; మెఱుగు = మెరుపుల; మొగిలు = మబ్బుల; తోడన్ = తోటి; మేలమాడున్ = సరసము లాడును; ఎదురులేని = తిరుగులేని; గరిమన్ = గొప్పదనములతో; ఇభ = ఏనుగుల; రాజ = పతులలో; ఇంద్రము = గొప్పది; వనజగేహ = మడుగు నందు {వనజగేహము - వనజము (పద్మములకు) గేహము (ఆకరము), సరోవరము}; కేళిన్ = క్రీడించుటకు; వ్రాలున్ = దిగెడి; అపుడు = సమయములో.

భావము:- అలా గజరాజు ఎదురులేకుండా పద్మాల సరోవరంలో ఈదుతున్నాడు. అప్పుడు, ఆడ ఏనుగులు అతనిమీద నీళ్ళు చల్లాయి. ఆ నీటి లో తడిసిన అతడు సెలయేళ్ళతో ఒప్పిన నీలగిరిలా ఉన్నాడు. ఆడ ఏనుగులు అతని దేహం నిండా కలువపూలు నింపాయి. వాటితో సహస్రాక్షుడైన ఇంద్రునిలా ఉన్నాడు. ఆడ ఏనుగులు అతని పై కమలాల పుప్పొడి చల్లాయి. దానితో అతడు బంగారు కొండలా గొప్పగా ఉన్నాడు. ఆడ ఏనుగులు అతనిపై కలువ తూండ్లు పరిచాయి. వాటితో అతడు సర్పాలు ధరించిన శివునిలా ప్రకాశిస్తున్నాడు. ఆడ మత్తేభాలు అతనిమీద ముత్యాలచిప్పలు వేసాయి. దానితో అతడు మెరుపుతీగలతో కూడిన మేఘాన్ని మించిపోయాడు.

రహస్యార్థం: ఆ జీవుడు, ప్రతిబంధాలు ఏవీ లేకుండా జ్ఞానంలో విహరిస్తూ, ఏనుగు నీలాద్రి మున్నగు రూపాలు పొందినట్లు, మూలాధారాది చక్రాలలో వాయువును బంధించి నపుడు, ఆయా దేవతా వర్ణాలను పొంది తుదకు పరమం అందు ఐక్యం అయ్యాడు.

33

మఱియు నా సరోవరలక్ష్మి మదగజేంద్ర వివిధ విహారవ్యాకులిత నూతన లక్ష్మీవిభవయై యనంగ విద్యానిరూఢ పల్లవ ప్రబంధపరికంపిత శరీరాలంకార యగు కుసుమ కోమలియునుం బోలె వ్యాకీర్ణ చికుర మత్తమధుకర నికరయు; విగతరస వదనకమలయు; నిజస్థాన చలిత కుచరథాంగ యుగళయు; లంపటిత జఘనపులినతలయునై యుండె; నంత.

టీక:- మఱియున్ = ఇంకను; ఆ = ఆ; సరోవర = మడుగు యనెడి; లక్ష్మి = శోభ; మద = మదించిన; గజేంద్ర = గజేంద్రుని; వివిధ = నానా; విహార = సంచారముల; వ్యాకులిత = కలతపెట్టబడిన; నూతన = సరికొత్త; లక్ష్మీ = శోభల; విభవ = వైభవములు గలది; ఐ = అయ్యి; అనంగ = కామకళా; విద్యా = శాస్త్రము నందు; నిరూఢ = ప్రసిద్ధమైన; పల్లవ = విటుని; ప్రబంధ = చౌసీతి(40)బంధాలచే; పరికంపిత = మిక్కిలి చలించిన; శరీరాలంకార = దేహాలంకారములు గలది; అగు = అయిన; కుసుమకోమలియున్ = పూలవంటి సుకుమారి; పోలె = వలె; వ్యాకీర్ణ = చెదరిన; చికుర = ముంగురులువంటి; మత్త = మదించిన; మధుకర = తుమ్మెదల; నికరయున్ = సమూహము గలది; విగతరస = వడలిన; వదన = మోమువంటి; కమలయున్ = ఎఱ్ఱతామర గలది; నిజ = తమ; స్థాన = స్థానమునుండి; చలిత = చెదరిపోయిన; కుచ = వక్షోజములువంటి; రథాంగ =

చక్రవాకముల; యుగళయున్ = జంట గలది; లంపటిత = నలిగిన; జఘన = పిరుదులువంటి; పులినతలయున్ = ఇసుకతిన్నెలు గలది; ఐ = అయ్యి; ఉండె = గోచరించుచున్నది; అంత = అంతట.

భావము:- అంతేకాక ఆ గజరాజు చేసిన విశేషమైన సంచారాలతో ఆ మడుగు చక్కదనాలు చెదిరి కొత్తందాలు సంతరించుకొంది. గడుసువాడైన విటునితో రతిక్రీడ చేస్తూ అతని కౌగిళ్ళలో చిక్కి వణుకుతున్న కుసుమ సుకుమారిలా చక్కగా ఉంది. మదించిన తుమ్మెదలు చెదిరిన ముంగురులుగా, రసాన్ని కోల్పోయిన పద్మాలు ముఖంగా, చక్రవాకాలు తమ స్థానాలనుండి చెదిరిన స్తనాలుగా, నలిగిన ఇసుక తిన్నెలు అలసిన పిరుదులుగా కనిపిస్తున్నాయి.

## కరి మకరుల యుద్ధము

34

భుగభుగాయితభూరి బుద్బుదచ్ఛటలతోఁ;
గదలుచు దివికి భంగంబు లెగయ;
భువన భయంకరఫూత్కార రవమున;
ఘోరనక్రగ్రాహకోటి బెగడ;
వాలవిక్షేప దుర్వార ఝంఝూనిల;
వశమున ఘుమఘుమావర్త మడరఁ;
గల్లోలజాల సంఘట్టనంబులఁ దటీ;
తరులమూలంబులై ధరణిఁ గూల;
సరసిలోనుండి పొడగని, సంభ్రమించి,
యుదరి కుప్పించి, లంఘించి, హుంకరించి,
భానుఁ గబళించి పట్టు స్వర్భానుపగిది
నొక్క మకరేంద్రుఁ డిభరాజు నొడిసిపట్టె.

టీక:- భుగభుగాయిత = భుగభుగ మనెడి శబ్దములతో; భూరి = అతిపెద్ద; బుద్బుద = నీటిబుడగల; ఛటల్ = సమూహముల; తోన్ = తోటి; కదలుచు = కదులుతు; దివి = ఆకాశమున; కిన్ = కు; భంగంబుల్ = కెరటములు; ఎగయన్ = ఎగురగా; భువన = లోకములకు; భయంకర = భీతి కలిగించెడి; ఫూత్కార = ఫూ యనెడి; రవమునన్ =

శబ్దములతో; ఘోర = భయంకరమైన; నక్ర = పీతల, ఎండ్రకాయల; గ్రాహ = మొసళ్ళ; కోటి = సమూహము; బెగడన్ = భయపడగా; వాల = తోకను; విక్షేప = జాడించుటచేత; దుర్వార = నివారింపరాని; ఝుంఝూనిల = ప్రచండమైన గాలి; వశమునన్ = వలన; ఘమఘుమ = ఘుమఘుమ ధ్వనులతో; ఆవర్తము = సుడిగుండాలు; అడరన్ = అతిశయించగా; కల్లోల = అలల; జాల = సమూహముల; సంఘట్టనంబులన్ = తాకిడికి; తటీ = ఒడ్డున గల; తరులు = చెట్లు; అమూలంబులు = పెల్లగింపబడినవి; ఐ = అయ్యి; ధరణిన్ = నేలపై; కూలన్ = కూలిపోగా.

సరసి = మడుగు; లోన్ = లోపల; నుండి = నుండి; పొడగని = జాడ కనిపెట్టి; సంభ్రమించి = వేగిరపడి; ఉదరి = కోపముతో చలించి; కుప్పించి = గెంతి; లంఘించి = దుమికి; హుంకరించి = హుమ్మని అరచి; భానున్ = సూర్యుని; కబళించి = మింగి; పట్టు = పట్టుకొనెడి; స్వర్భాను = రాహువు {స్వర్భానువు - స్వర్గమున ప్రకాశించువాడు, రాహువు}; పగిదిన్ = వలె; ఒక్క = ఒక; మకర = మొసలి; ఇంద్రుడు = ప్రభువు; ఇభ = గజ; రాజున్ = రాజును; ఒడిసిపట్టె = ఒడుపుగా పట్టుకొనెను.

<u>భావము</u>:- ఒక మొసలి రాజు ఆ మడుగులో ఒక మూల దాక్కొని గజరాజుని చూసాడు. భుగభుగ మని చప్పుళ్ళతో పెద్ద పెద్ద బుడగలు పుట్టి అలలు ఆకాశానికి ఎగిసిపడేలా పైకి ఎగిరాడు. మొసళ్ళు చేపలు భయపడేలా లోకానికి భీతి కలిగేలా ఫూత్కారం చేసాడు. వడికి లేచిన గాలికి ఘుమఘుమ అని సుడి గుండాలు లేచేలా తోక జాడించాడు. హుంకారం చేస్తూ కుప్పించి ఎగిరాడు. రాహువు సూర్యుడిని పట్టుకొన్నట్లుగా ఆ మొసలిరాజు ఆ గజరాజుని ఒడిసిపట్టుకొన్నాడు.

35

వడిఁ దప్పించి కరీంద్రుఁడు

<u>ని</u>డుదకరం బెత్తి వ్రేయ <u>నీ</u>రాటంబుం

బొడ వడఁగినట్లు జలములఁ

<u>బ</u>డి కడువడిఁ బట్టెఁ బూర్వ<u>ప</u>దయుగళంబున్.

<u>టీక</u>:- వడిన్ = (పట్టు యొక్క) బిగువును; తప్పించి = విడివడి; కరీంద్రుడు = గజేంద్రుడు; నిడుద = పొడవైన; కరంబున్ = తొండమును; ఎత్తి = పైకెత్తి; వ్రేయన్ = కొట్టగా; నీరాటంబున్ = జలచరము; పొడవు = శక్తి; అడగిన = నశించిన; అట్లు = విధముగా;

జలములన్ = నీటిలో; పడి = పడిపోయి; కడు = మిక్కిలి; వడిన్ = వేగముగా; పట్టెన్ = పట్టుకొనెను; పూర్వ = ముందు; పద = కాళ్ళ; యుగళంబున్ = ద్వయమును.
భావము:- గజేంద్రుడు మొసలి పట్టునుండి తప్పించుకొన్నాడు. తన పొడవైన తొండాన్ని ఎత్తి కొట్టాడు. ఆ దెబ్బకి మొసలి బలం పోయినట్లు నీళ్ళలో పడిపోయింది. అతి వేగంగా అది గజరాజు ముందరి కాళ్ళు పట్టుకొంది.

36

పదములఁ బట్టినం దలకుబాటొకయింతయు లేక శూరతన్
మదగజవల్లభుండు ధృతిమంతుఁడు దంతయుగాంత ఘట్టనం
జెదరఁగఁ జిమ్మె; న మ్మకరిచిప్పలు పాదులు దప్పనొప్పఅన్
వదలి జలగ్రహంబు కరివాలముమూలముఁ జీరెఁ గోఱలన్.

టీక:- పదములన్ = కాళ్ళను; పట్టినన్ = పట్టుకొనగా; తలకుబాటు = తత్తరపాటు; ఒకయింతయున్ = కొంచెము కూడ, ఏమాత్రమూ; లేక = లేకుండగ; శూరతన్ = శౌర్యములో; మద = మదించిన; గజవల్లభుండు = గజేంద్రుడు; ధృతిమంతుడు = ధైర్యశాలి; దంత = దంతముల; యుగ = రెంటి; అంత = చివరలతో; ఘట్టనన్ = కొట్టుటచేత; చెదరగన్ = చెదిరిపోవునట్లు; చిమ్మెన్ = విసిరెను; ఆ = ఆ; మకరి = మొసలి యొక్క; చిప్పలు = పొలుసులు; పాదులు = కుదుళ్లు; తప్పనొప్పఅన్ = వదులైపోవునట్లు; వదలి = విడిచిపెట్టి; జలగ్రహంబు = మొసలి; కరి = ఏనుగు యొక్క; వాలము = తోక; మూలమున్ = మొదలును; చీరెన్ = చీరివేసెను; కోఱలన్ = పళ్ళతో.
భావము:- మొసలి తన కాళ్ళు పట్టుకోగా, గజరాజు ఏమాత్రం తడబాటు చెందలేదు. ధైర్యంగా తన దంతాల మొనలతో బలంగా ఆ మొసలి దేహం మీది చిప్పలు కదిలిపోయేలా పొడిచాడు. మొసలి పట్టు తప్పింది. వెంటనే మొసలి ఏనుగు కాళ్ళు వదలి తోకని గోరులతో చీరింది.

37

కరిఁ దిగుచు మకరి సరసికిఁ
గరి దరికిని మకరిఁ దిగుచు గరకరి బెరయన్
గరికి మకరి మకరికిఁ గరి
భరమనుచును నతల కుతల భటు లరుదు పడన్.

టీక:- కరిన్ = ఏనుగును; తిగుచున్ = లాగును; మకరి = మొసలి; సరసి = మడుగులోని; కిన్ = కి; కరి = ఏనుగు; దరి = ఒడ్డున; కిని = కి; మకరిన్ = మొసలిని; తిగుచున్ = లాగును; కరకరిన్ = క్రూరస్వభావము, పట్టుదల; పెరయన్ = అతిశయించగా; కరి = ఏనుగున; కిన్ = కు; మకరి = మొసలి; మకరి = మొసలి; కిన్ = కి; కరి = ఏనుగు; భరము = భారమైనది; అనుచున్ = అంటూ; అతల = పాతాళలోకపు; కుతల = భూలోక; భటుల్ = వీరులు; అరుదు = ఆశ్చర్య; పడన్ = పడగా.

భావము:- మొసలి ఏనుగును మడుగులోకి లాగింది. ఏనుగు మొసలిని గట్టు పైకి ఈడ్చింది. రెండు ద్వేషం పట్టుదలలు పెంచుకొన్నాయి. "మొసలిని ఏనుగు తట్టుకోలేదు, ఏనుగుని మొసలి తట్టుకోలేదు" అనుకుంటు పాతాళ, భూ లోకాల శూరులూ ఆశ్చర్య పోయారు.

38

ఇట్లు కరిమకరంబులు రెండును నొండొండ సముద్దండదండంబులై తలపడి నిఖిల లోకాలోకన భీకరంబులై, యన్యోన్య విజయశ్రీ వశీకరంబులై, సంక్షోభిత కమలాకరంబులై, హరి హరియును గిరి గిరియునుం దాఁకి పెనంగు తెఱంగున నీరాటం బయిన పోరాటంబునం బట్టుచు, వెలికి లోనికిం దిగుచుచుఁ, గొలంకు గలంకంబొందఁ గడువడి నిట్టట్టుఁ బడి తడఁబడక, బుడబుడానుకారంబులై బుగులు బుగు ల్లను చప్పుళ్ళతో నురువులుఁ గట్టుచు, జలంబు లుప్పరం బెగయం జప్పరించుచుఁ, దప్పక వదనగహ్వరంబుల నప్పళించుచు, నిశితనితాంత దురంతదంత కుంతంబుల నింతింతలు తునియలయి నెప్పళంబునం బునుక చిప్పలుఁ గుదుళ్ళుఁ దప్పి రక్తంబులుఁ గ్రమ్ముదేర హుమ్మని యొక్కుమ్మడిం జిమ్ముచు, నితరేతర సమాకర్షణంబులం గదలక పదంబుల మొదలిపట్టు వదలక కుదురై వర్తించుచు, బరిభ్రమణ వేగంబున జలంబులం దిరుగుచు, మకర కమఠ కర్కట గండక మండూకాది సలిల నిలయంబుల ప్రాణంబులు క్షీణంబులుగా నొండొంటిం దాఁకు రభసంబున నిక్కలుబడ మ్రక్కం ద్రొక్కుచు, మెండుచెడి బెండుపడి నాఁచు గుల్లచిప్ప తండంబులఁ బరస్పర తాడనంబులకు నడ్డంబుగా నొడ్డుచు, నోలమాసగొనక గెలుపు దలంపులు బెట్టిదంబులై రెట్టింప నహోరాత్రంబులుం బోలెఁ గ్రమక్రమ విజృంభమాణంబులై బహుకాల కలహ విహారంబులయి నిర్గత నిద్రాహారంబులై యవక్రపరాక్రమ ఘోరంబులై పోరుచున్న సమయంబున.

టీక:- ఇట్లు = ఈ విధముగ; కరి = ఏనుగు; మకరంబులున్ = మొసలి; రెండును = రెండును (2); ఒండొండ = ఒకదాని నొకటి; సమ = మిక్కిలి; ఉద్దండ = అధికమైన; దండంబులు = పీడనములు చేసెడివి; ఐ = అయ్యి; తలపడి = ఢీకొని; నిఖిల = సమస్త; లోక = లోకములకు; ఆలోకన = చూచుటకు; భీకరంబులు = భీతి కలిగించెడివి; ఐ = అయ్యి; అన్యోన్య = ఒకదానినొకటి; విజయ = గెలుపు; శ్రీ = అధిక్యమునకు; వశీకరంబులు = లోబరుచుకొనినవి; ఐ = అయ్యి; సంక్షోభిత = కల్లోలపరచబడిన; కమలాకరంబులు = సరోవరము గలవి; ఐ = అయ్యి; హరి = సింహము; హరియును = సింహమును; గిరి = కొండ; గిరియునున్ = కొండను; తాకి = ఢీకొని; పిఱుతివియక = వెనుదీయక; పెనంగు = పోరాడెడి; తెఱంగునన్ = విధముగా; నీరాటంబున్ = నీటిలో జరుగునది; అయిన = ఐన; పోరాటంబునన్ = పెనగులాటలో; పట్టుచున్ = పట్టుకొని; వెలి = బయట; కిన్ = కు; లోని = లోపల; కిన్ = కి; తిగుచుచున్ = లాగుతూ; కొలంకున్ = మడుగు; కలకంబు = కల్లోలపడుట; పొందన్ = పొందగా; కడు = మిక్కిలి; వడిన్ = తీవ్రముగా; ఇట్టట్టుబడి = ఇటు అటు పడుతు; తడబడక = తొట్రుబడక; బుడబుడ = బుడబుడ యనెడి; అనుకారంబులు = అనుకార శబ్దములు కలవి; ఐ = అయ్యి; బుగులుబుగులు = బుగులుబుగులు; అను = అనెడి; చప్పుళ్ళ = శబ్దముల; తోన్ = తోటి; నురువులుకట్టుచు = నురుగులు చేస్తూ; జలంబులున్ = నీళ్ళు; ఉప్పరంబున్ = ఆకాశమునకు; ఎగయన్ = ఎగజిమ్ముతుండగ; చప్పరించుచున్ = చప్పరించుతు; తప్పక = విడువక; వదన = నోరు యనెడి; గహ్వరంబులన్ = గుహలతో; అప్పళించుచున్ = కొరుకుచు; నిశిత = పదునైన; నితాంత = దట్టంబైన; దురంత = అంతులేని; దంత = కోర లనెడి; కుంతలంబులన్ = ఈటెలతో; ఇంతింతలు = చిన్న చిన్న; తునియలు = ముక్కలు; అయి = అయ్యి; అప్పళంబునన్ = చఱచుటలతో; పునుక = పుఱ్ఱె; చిప్పలున్ = ఎముకలు; కుదుళ్ళు = మూలాలు; తప్పి = జారి; రక్తంబులు = రక్తములు; క్రమ్ముదేర = ఉబుకునట్లుగ; హుమ్మని = హుమ్మని శబ్దముచేస్తూ; ఒక్కుమ్మడిన్ = ఒక్కపెట్టున; జిమ్ముచున్ = విసిరికొట్టుచు; ఇతరేతర = ఒకదానినొకటి; సమాకర్షణంబులన్ = లాగుకొనుటల యందు; కదలక = కదిలిపోకుండగ; పదంబుల = కాళ్ళ; మొదలిపట్టు = మూలాధారపట్టులను; వదలక = వదలివేయక; కుదురు = నిలదొక్కుకున్నవి; ఐ = అయ్యి; వర్తించుచున్ = తిరుగుచు; పరిభ్రమణ =

తిరిగెడు; వేగంబునన్ = వేగముతో; జలంబులన్ = నీళ్ళతో; తిరుగుచున్ = తిరుగుతు; మకర = మొసళ్ళు; కమఠ = తాబేళ్ళు; కర్కట = పీతలు; గండక = చేపలు; మండూక = కప్పలు; ఆది = మొదలైన; సలిలనిలయంబులన్ = జలచరంబుల; ప్రాణంబులు = ప్రాణములు; క్షీణంబులు = సన్నగిల్లినవి; కాన్ = అవ్వగా; ఒండొంటిన్ = ఒకదానినొకటి; తాకు = ఢీకొనెడి; రభసంబునన్ = గడబిడవలన; ఇక్కలుబడ = స్థానభ్రంశము అగునట్లు; మ్రక్కన్ = చచ్చేటట్లు; త్రొక్కుచున్ = తొక్కుతు; మెండుచెడి = బలము తగ్గి; బెండుపడి = శుష్కించి; నాచు = నాచు; గుల్ల = నత్తగుల్లల; చిప్ప = ఆల్చిప్పల; తండంబులన్ = సమూహములను; పరస్పర = ఒకదానినొకటి; తాడనంబులకు = కొట్టుకొనుటల; కున్ = కు; అడ్డంబుగాన్ = అడ్డముగా; ఒడ్డుచున్ = పెట్టుకొనుచు; ఓలమాసగొనక = మరుగుపడక; గెలుపు = గెలవాలనే; తలంపులు = భావనలు; బెట్టిదంబులు = అధికమైనవి; ఐ = అయ్యి; రెట్టింపన్ = ద్విగుణీకృతముకాగ; అహోరాత్రంబులున్ = రాత్రింబవళ్ళును; పోలెన్ = వలె; క్రమక్రమ = అంతకంతకు; విజృంభమాణంబులు = చెలరేగునవి; ఐ = అయ్యి; బహు = చాలా; కాల = కాలము; కలహవిహారంబులు = పోరాడుచున్నవి; అయి = ఐ; నిర్గత = విడిచిన; నిద్రాహారంబులు = నిద్ర ఆహారంబులు గలవి; ఐ = అయ్యి; అవక్ర = మొక్కవోని; పరాక్రమ = శౌర్యముచే; ఘోరంబులు = ఘోరమైనవి; ఐ = అయ్యి; పోరుచున్న = పోరాడుచున్న; సమయంబున = సమయము నందు.

<u>భావము</u>:- ఏనుగు మొసలి రెండు అభిమానంతో ఒకదాన్ని మించి ఒకటి ఢీకొన్నాయి. వాటి పోరు అన్ని లోకాలకి భయంకరంగా సాగింది. అవి రెండు కూడ రెండవ దానిని ఓడించాలనే పట్టుదలతో మడుగునంతా కలచివేసాయి. సింహంతో సింహం, కొండతో కొండ వెనుదీయకుండ ఢీకొని పోరాడుతున్నట్లు అవి రెండు తీవ్రంగా పోరాడాయి. బయటికి లోపలికి లాగుతు, అటునిటు పడుతున్న తొట్రుపడలేదు. ఆ నీళ్ళలో బుడ బుడ బుగలు బుగలు మనే శబ్దాలు చెలరేగాయి. లేచిన నురగలు ఆకాశాన్ని తాకాయి. మొసలి ఏనుగులు రెండు ఎడతెరపి లేకుండ ముట్టెలతో తాకుతు, తలలు బద్ధలయ్యేలా, చిప్పల అమరికలు తప్పేలా, నెత్తుర్లు కారేలా హుమ్మంటు వాడి పండ్లతో పొడుచు కొన్నాయి. ఒకదానిని ఒకటి లాగేటప్పుడు కాళ్ళపట్టు తప్పిపోకుండ బలంగా నిలదొక్కుకున్నాయి. అప్పుడు సరస్సులోని నీళ్ళు వేగంగా సుళ్ళు తిరిగాయి. ఆ నీళ్ళ

తాకిడికి మొసళ్ళు తాబేళ్ళు పీతలు చేపలు కప్పలు మొదలైనవి చచ్చిపోయాయి. బింకంతో వేగంగా మొసలి ఏనుగు ఒకదాని నొకటి అణగదొక్కతు చికాకుపరచు కొంటు బాగా అలసిపోయాయి. ఒకదాని దెబ్బలనుండి ఒకటి నాచును ఆల్చిప్పలను అడ్డంవేసి తప్పించుకొసాగాయి. శరీరాల మీద ఆశలు వదలుకొన్నాయి. ఎలాగైనా గెలవాలనే కోరిక రెట్టింపు చేసుకొన్నాయి. క్రమక్రమంగా చెలరేగుతు రేయింబగళ్ళు తిండి నిద్ర లేకుండ అవి రెండు చాలా కాలం పోరాడాయి

39

జవమును జలమును బలమును
వివిధములుగఁ బోరు కఱటివీరతకు భువిన్
దివి మకర మీన కర్కట
నివహము లొక్కటన మిత్రనిలయముఁ బొందెన్.

టీక:- జవమునున్ = చురుకుదనము; చలమునున్ = పట్టుదల; బలమును = శక్తి కలిగి; వివిధములుగన్ = నానావిధముల; పోరు = పోరాడుచున్న; కఱటి = ఏనుగు; వీరత = పరాక్రమమున; కున్ = కు; భువిన్ = నేలమీద; దివిన్ = ఆకాశములోని; మకర = మకర; మీన = మీన; కర్కాటక = కర్కాటక; నివహములు = రాశులు; ఒక్కటన = ఒక్కసారిగ; మిత్ర = రవి; నిలయమున్ = ఇంట; పొందెన్ = ప్రవేశించినవి.

భావము:- గజరాజు మిక్కిలి చురుకుదనంతో పట్టుదలతో అనేక విధములుగ మొసలితో యుద్ధం చేస్తున్నాడు. అతని పరాక్రమం చూసి బెదిరి ఆకాశంలోని మకర మీన కర్కాటక రాసులు ఒక్క సారిగా సూర్యమండలంలో దూరాయి. (ఉత్ప్రేక్ష అలంకారం). భూలోకంలో మొసలితో చెపలు, పీతలు స్నేహం చూపాయి (మరి సహ జలచరాలు కదా)

40

ఆటోపంబునఁ జిమ్ముఁ ఱొమ్మగల వజ్రాభీల దంతంబులం
దాటించున్, మెడఁ జుట్టిపట్టి హరి దోర్దండాభ శుండాహతిన్
నీటన్ మాటికి మాటికిం దిగువఁగా నీరాటమున్ నీటి పో
రాట న్నోటమిపాటుఁ జూపుట కరణ్యాటంబు వాచాటమై.

టీక:- ఆటోపంబునన్ = వేగిరిపాటుతో; చిమ్మున్ = ఎగురగొట్టును; ఱొమ్ము = వక్షస్థలము; అగలన్ = పగిలిపోవునట్లు; వజ్ర = వజ్రాయుధము వంటి; అభీల =

భయంకరమైన; దంతంబులన్ = దంతములతో; తాటించున్ = కొట్టును; మెడన్ = కంఠమును; చుట్టిపట్టి = చుట్టూ పట్టుకొని; హరి = ఇంద్రుని; దోర్దండ = భుజదండము; అభ = వంటి; శుండా = తొండము యొక్క; హతిన్ = దెబ్బచేత; నీటన్ = నీటిలోనికి; మాటికిమాటికిన్ = మరలమరల; తిగువగా = లాగుతుండగ; నీరాటమున్ = మొసలిని {నీరాటము – నీటి యందు చరించునది, మొసలి}; నీటి = నీటిలో చేయు; పోరాటన్ = యుద్ధములో; ఓటమిపాటు = ఓడిపోవుటను; చూపుట = చూపించుట; కున్ = కు; అరణ్యాటంబున్ = ఏనుగు {అరణ్యాటము – అరణ్యములో తిరుగునది, ఏనుగు}; వాచాటము = అరుచుచున్నది; ఐ = అయ్యి.

<u>భావము</u>:- గజేంద్రుడు నీటిలోకి మాటి మాటికి లాగుతున్న ఆ మొసలిని నీటి పోరాటంలో ఓడించాలని గగ్గోలు చేసాడు. దానిని వేగంగా వజ్రాయుధం లాంటి తన భయంకరమైన దంతాగ్రాలతో దాని రొమ్ము పగిలేలా చిమ్మి పొడిచాడు. ఇంద్రుని భుజంలాంటి తన తొండంతో దాని మెడను చుట్టి విసిరి కొట్టాడు.

41

అప్పుడు.

<u>టీక</u>:- అప్పుడు = అప్పుడు.

<u>భావము</u>:- ఆ సమయంలో,

42

<u>మ</u>కరితోడఁ బోరు <u>మా</u>తంగవిభుని నొ
<u>క్క</u>రుని డించి పోవఁ <u>గా</u>ళ్ళు రాక
<u>గో</u>రి చూచు చుండెఁ <u>గుం</u>జరీయూథంబు
<u>మ</u>గలు దగులుఁ గారె <u>మ</u>గువలకును?

<u>టీక</u>:- మకరి = మొసలి; తోడన్ = తోటి; పోరు = పోరాడుచున్న; మాతంగవిభుని = గజేంద్రుని; ఒక్కరునిన్ = ఒక్కడిని; డించి = విడిచిపెట్టి; పోవన్ = వెళ్ళిపోవుటకు; కాళ్ళురాక = బుద్ధిపుట్టక; కోరి = కావాలని; చూచుచుండెన్ = ఊరక చూచుచున్నవి; కుంజరీ = ఆడ యేనుగుల; యూథబు = సమూహము; మగలు = భర్తలు; తగులు = బంధనములు; కారె = కారా ఏమి, కదా; మగువలకును = భార్యలకు.

భావము:- మొసలితో పోరాడుతున్న గజరాజును ఒంటరిగా వదలి వెళ్ళిపోడానికి ఆడ ఏనుగులకు కాళ్ళాడలేదు. అవి ఊరకే చూస్తు ఉన్నాయి. ఆడవారికి భర్తలమీద బంధం విడదీయరానిది కదా.

43

అంత.

టీక:- అంత = అంతట.

భావము:- అప్పుడు,

44

జీవనంబు దనకు జీవనంబై యుంట

నలవుఁ జలము నంతకంత కెక్కి

మకర మొప్పెఁ; డస్సె మత్తేభమల్లంబు

బహుళపక్ష శీతభాను పగిది.

టీక:- జీవనంబు = నీరు; తన = తన; కున్ = కు; జీవనంబు = జీవనాధారము; ఐ = అయ్యి; ఉంటన్ = ఉండుటచేత; అలవున్ = సామర్థ్యము, శక్తి; చలమున్ = పట్టుదల; అంతకంతకు = క్రమముగా; ఎక్కి = పెరిగి; మకరము = మొసలి; ఒప్పెన్ = అతిశయించినది; డస్సెన్ = అలసిపోయినది; మత్తేభ = ఏనుగు; మల్లంబు = వీరుడు; బహుళపక్ష = కృష్ణపక్షము నందలి; శీతభాను = చంద్రుని {శీతభానుడు - శీత (చల్లగా) భానుడు (ప్రకాశించువాడు), చంద్రుడు}; పగిదిన్ = వలె.

భావము:- మొసలికి బతుకుతెరువు నీళ్లే కదా. అందుకని దానికి క్రమంగా బలము పట్టుదల పెరిగాయి. గజరాజు కృష్ణపక్ష చంద్రుని వలె తగ్గిపోసాగేడు.

45

ఉఱుకుం గుంభయుగంబుపై హరి క్రియన్ హుమ్మంచుఁ; బాదంబులం

నెఱయం గంతము వెన్ను దన్ను; నెగయున్ హేలాగతిన్; వాలముం

జఱచుం; నుగ్గుగఁ దాఁకు; ముంచు; మునుగుం; శల్యంబులుం దంతముల్

విఱుఁగన్ వ్రేయుచుఁ బొంచిపొంచి కదియున్ వేదండ యూథోత్తమున్.

టీక:- ఉఱుకున్ = దుముకును; కుంభ = కుంభములు; యుగంబున్ = రెంటి; పైన్ = మీదికి; హరి = సింహము; క్రియన్ = వలె; హుమ్ = హుంకారము; అంచున్ = చేయుచు;

పాదంబులన్ = కాళ్ళు; నెఱయన్ = అల్లుకొనుచు; కంఠమున్ = మెడను; వెన్నున్ = వీపును; తన్నున్ = తన్నును; ఎగయున్ = ఎగురును; హేలాగతిన్ = సులువుగా; వాలమున్ = తోకను; చఱచున్ = కొట్టును; నుగ్గుగన్ = పిండిపిండిగ; తాకున్ = ఢీకొట్టును; ముంచున్ = నీళ్లలో ముంచుతుంది; మునుగున్ = మునుగుతుంది; విఱుగన్ = విరిగిపోయేలా; వ్రేయుచున్ = కొడుతూ; పొంచిపొంచి = దాగుకొని; కదియున్ = కలియబడుతుంది; వేదండ = ఏనుగుల; యూధ = గుంపులో; ఉత్తమున్ = గొప్పవానిని.

భావము:- మొసలి సింహంలా హుంకరించి ఒక్కదుటున గజేంద్రుని కుంభస్థలంపైకి ఉరుకుతుంది. పాదాల మధ్య దూరి గిరగిర తిరుగుతుంది. మెడని వీపుని తన్నుతుంది. సులువుగా ఎగిరి తోక కొరుకుతుంది. నలిగిపోయేలా ఢీకొడుతుంది. నీళ్ళలో ముంచుతుంది. తాను మునుగుతుంది. దాగి దాగి మీదపడు తుంది. ఎముకలు దంతాలు విరిగేలా కొడుతుంది.

46

పొడగానం బడకుండ డాఁగు; వెలికిం బోవంగ దా నడ్డమై
పొడచూపుం; జరణంబులం బెనగొనుం; బో రాక రా రాక బె
గ్గడిలం గూలఁగఁదాఁచు; లేచుతఱి నుద్ఘాటించు; లంఘించుఁ; బ
ల్విడిఁ జీరుం; దలఁగున్; మలంగు; నొడియన్ వేధించుఁ; గ్రోధించుచున్.

టీక:- పొడ = జాడ; కానంబడకుండ = తెలియకుండ; డాగున్ = పొంచి యుండును; వెలికిన్ = బయటకు; పోవంగన్ = వెళ్లబోతే; తాన్ = తను; అడ్డమై = అడ్డముగా నున్నదై; పొడచూపున్ = కనబడును; చరణంబులన్ = కాళ్ళను; పెనగొనున్ = అల్లుకుపోవును; పోరాకరారాక = అటుఇటు కదలలేక; బెగ్గడిలన్ = భయపడగా; కూలంగ = కూలిపోయెటట్లు; తాచున్ = తన్నును; లేచు = మరల లేచెడి; తఱిన్ = సమయము నందు; ఉద్ఘాటించున్ = వ్రచ్చును; లంఘించున్ = దుముకును; బల్విడిన్ = బలముగా; చీరున్ = చీరుతుంది; తలగున్ = తప్పుకొనును; మలంగున్ = అదృశ్య మగును; ఒడియన్ = పట్టుకొందా మంటె; వేధించున్ = వేధించుతుంది; క్రోధించున్ = కోపిస్తుంది.

భావము:- మొసలి కనబడకుండా నీళ్ళల్లో దాగి ఉంటుంది. ఏనుగు గట్టుపైకి పోతుంటే అడ్డంగా వస్తుంది. కనబడి కాళ్ళకు చుట్టుకు పోతుంది. అటునిటు కదలకుండ చేసి భయంతో కూలిపోయేలా తోకతో కొడుతుంది. లేచినప్పుడు ఒళ్ళు జాడించి పైపైకి

గెంతుతుంది. చటుక్కున తప్పుకుంటుంది. గోళ్లతో గీరుతుంది. ఒడిసి పట్టి వేధించి, కోపం చూపెడుతుంది.

47

ఇట్లు విస్మిత నక్రచక్రంబయి నిర్వక్రవిక్రమంబున నల్పహృదయజ్ఞాన దీపంబు నతిక్రమించు మహా మాయాంధకారంబునుంబోలె నంతకంతకు నుత్సాహ కలహసన్నాహ బహువిధ జలావగాహం బయిన గ్రాహంబు మహాసాహసంబున.

టీక:- ఇట్లు = ఈ విధముగ; విస్మిత = ఆశ్చర్యపడుతున్న; నక్ర = మొసళ్ళ; చక్రంబు = గుంపు గలది; అయి = ఐ; నిర్వక్ర = మొక్కపోని; విక్రమంబునన్ = పరాక్రమముతో; అల్ప = అల్పుని; హృదయ = హృదయము నందలి; జ్ఞాన = జ్ఞానము యనెడి; దీపంబున్ = దీపమును; అతిక్రమించు = కప్పివేసెడి; మహా = గొప్ప; మాయ = మాయ యనెడి; అంధకారంబునున్ = చీకటి; పోలెన్ = వలె; అంతకంతకున్ = క్రమముగా; ఉత్సాహ = ఉత్సాహము; కలహసన్నాహ = పోరాట యత్నములు; బహువిధ = వివిధ; జల = నీటిలో; అవగాహంబు = మునుకలు గలది; అయిన = ఐన; గ్రాహంబు = మొసలి; మహా = గొప్ప; సాహసంబునన్ = సాహసముతో.

భావము:- ఇలా ఆ మొసలి సాటి మొసళ్ళు ఆశ్చర్యం పోయేలా, అవక్రపరాక్రమం చూపింది. మహామాయ అనే అంధకారం అల్ప మైన జ్ఞానకాంతిని కప్పివేసినట్లు, రకరకాలుగా నీటిలో మునిగి తేలుతు మొసలి క్రమక్రమంగా పెరిగే ఉత్సాహంతో పోరాట పటిమతో గొప్ప సాహసంతో గజరాజును ఆక్రమించసాగింది.

48

పాదద్వంద్వము నేలమోపి, పవనున్ బంధించి, పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి, బుద్ధిలతకున్ మాఱాకు హత్తించి, ని
ష్ఖేదబ్రహ్మపదావలంబనరతిం గ్రీడించు యోగీంద్రు మ
ర్యాదన్ నక్రము విక్రమించెఁ గరిపాదాక్రాంతనిర్వక్రమై.

టీక:- పాద = కాళ్ళు; ద్వంద్వమున్ = రెంటిని; నేలన్ = నేలపైన; మోపి = ఆన్చి; పవనున్ = గాలిని; బంధించి = బిగపట్టి; పంచేంద్రియ = పంచేంద్రియముల {పంచేంద్రియములు - 1కళ్ళు 2ముక్కు 3నాలుక 4చెవులు 5చర్మము}; ఉన్మాదంబున్ = స్వేచ్ఛావిహారమును; పరిమార్చి = అణచివేసి; బుద్ధి = బుద్ధి యనెడి; లత = తీవె; కున్

= కు; మాఱాకు = తీగపాకురాట, ఆధారము; హత్తించి = కలిగించి; నిష్ఖేద = విచారములేని; బ్రహ్మ = బ్రహ్మ యొక్క; పదా = స్థానమార్గమును; అవలంబన = అవలంబించు; రతిన్ = ప్రీతితో; క్రీడించు = విహరించు; యోగి = యోగి; ఇంద్రున్ = శ్రేష్ఠుని; మర్యాదన్ = విధముగా; నక్రము = మొసలి; విక్రమించెన్ = పరాక్రమించినది; కరి = ఏనుగు యొక్క; పాద = పాదములను; ఆక్రాంతిన్ = ఆక్రమించుకొనుటలో; నిర్వక్రము = అడ్డులేనిది; ఐ = అయ్యి.

భావము:- మహాయోగి వాయువులు బంధించి తన పంచేంద్రియాల ఆడంబరాన్ని అణగార్చి, బుద్ధి అనే తీగకు మారాకు పట్టించి, పట్టుదలగా దుఃఖ రాహిత్య ఆనందమయ పరబ్రహ్మ పదాన్ని అందుకొని ఆనందిస్తాడు. అలానే మొసలి తన రెండుకాళ్ళూ నేలమీద గట్టిగా ఆనించి ఊపిరి బిగబట్టి పట్టిన ఏనుగు కాళ్ళను వదలకుండ జయింపరానిదై విజృంభించింది.

49

వనగజంబు నెగచు వనచారిఁ బొడగని,
వనగజంబ కాన వజ్రిగజము
వెల్ల నై సురేంద్రు వేచి, సుధాంధులు
పట్టఁ బట్టనీక బయలు ప్రాఁకె.

టీక:- వన = అడవి; గజంబున్ = ఏనుగును; ఎగచు = తరుముచున్న; వనచారిన్ = మొసలిని {వనచారి - వనము (నీటి)యందు చారి (చరించునది), మొసలి}; పొడగని = చూసి; వన = నీటిలో పుట్టిన; గజంబ = ఏనుగే; కాన = కనుక; వజ్రిగజము = ఐరావతము {వజ్రిగజము - వజ్రి (ఇంద్రుని) యొక్క గజము (ఏనుగు), ఐరావతము}; వెల్లన = తెల్లటిది; ఐ = అయ్యి; సురేంద్రున్ = ఇంద్రుని; వేచి = పడవేసి; సుధాంధులు = దేవతలు {సుధాంధువులు - సుధ (అమృతము)ను అంధుస్సు (అన్నము)గా కలవారు, దేవతలు}; పట్టన్ = పట్టబోతే; పట్టనీక = చిక్కకుండ; బయలున్ = ఆకాశమునకు; ప్రాకెన్ = పాకిపోయెను.

భావము:- వనం (అడవి) లో తిరిగే గజరాజును పీడించే ఆ వనం (జలం) లో చరించే మొసలిని చూసి, ఇంద్రుడి ఏనుగు ఐన ఐరావతం, వనం (జలం) నుండి జనించింది కనుక

తెల్ల బోయింది. ఆ ఐరావతం ఇంద్రుడిని పడేసి దేవతలకు పట్టు కుందామంటే చిక్కకుండ ఆకాశంలో పరిగెడుతోంది.

50

ఊహ గలంగి జీవనపుటోలమునం బడి పోరుచున్ మహా
మోహలతా నిబద్ధపదమున్ విడిపించుకొనంగ లేక సం
దేహముఁ బొందు దేహి క్రియ దీనదశన్ గజ ముండె భీషణ
గ్రాహ దురంత దంత పరిఘట్టిత పాదఖురాగ్ర శల్యమై.

టీక:- ఊహన్ = బుద్ధి; కలంగి = కలతచెంది; జీవనము = నీటిమడుగు, జీవితపు; ఓలమునన్ = మరుగున, క్లేశము లందు; పడి = పడిపోయి; పోరుచున్ = పోరాడుతూ; మహా = గొప్ప; మోహ = అజ్ఞాన మనెడి; లతా = తీగలకి; నిబద్ధ = మిక్కిలి కట్టుబడిన; పదమున్ = దారిని, స్థానమును; విడిపించుకొనంగ = విడిపించుకొన; లేక = రాక; సందేహమున్ = శంకను; పొందు = పొందెడి; దేహి = జీవుని; క్రియన్ = విధముగా; దీన = దీనమైన; దశన్ = అవస్థలో; గజము = ఏనుగు; ఉండెన్ = ఉండెను; భీషణ = ఘోరమైన; గ్రాహ = మొసలి యొక్క; దురంత = దాటరాని; దంత = దంతములచే; పరిఘట్టిత = గట్టిగా కరవబడిన; పాద = కాలి; ఖురాగ్ర = గిట్టలు తుద నున్న; శల్యము = ఎముకలు గలది; ఐ = అయ్యి.

భావము:- బ్రతుకుతెరువులో పడిపోయి మోహం అనే తీగచే కట్టు బడిన పాదాలు విడిపించుకోడం చేతకాక సందేహానికి గురైన జీవుడి వలె గజేంద్రుడు భయంకరమైన ఆ మొసలి కోరలకు చిక్కి శల్యావశిష్టమైన కాలిగిట్టలు కలవాడై దీనంగా అలమటిస్తున్నాడు.

51

ఇ వ్విధంబున.

టీక:- ఈ = ఈ; విధంబునన్ = విధముగా.

భావము:- ఇలా,

52

అలయక, సొలయక, వేసట
నొలయకఁ, గరి మకరితోడ నుద్దండత రా
త్రులు, సంధ్యలు, దివసంబులు

సలిపెం బో రొక్క వేయి సంవత్సరముల్.

టీక:- అలయక = అలసిపోకుండగ; సొలయక = వెనుదీయక; వేసటన్ = శ్రమమును; ఒలయకన్ = పొందక; కరి = ఏనుగు; మకరి = మొసలి; తోడన్ = తోటి; ఉద్దండతన్ = తీవ్రముగా; రాత్రులు = రాత్రులు; సంధ్యలు = సంధ్యలు; దివసంబులు = పగళ్ళు; సలిపెన్ = సాగించెను; పోరు = పోరాటమును; ఒక్క = ఒక; వేయి = వెయ్యి (1000); సంవత్సరముల్ = ఏండ్లకాలము.

భావము:- ఇలా, గజరాజు రాత్రులు బవళ్ళు సంధ్యలు ఎడతెగకుండ ఒక వెయ్యి సంవత్సరాల పాటు అలసిపోకుండా సోలిపోకుండా విసిగిపోకుండా తీవ్రంగా మొసలితో యుద్ధం సాగించాడు.

## గజేంద్రుని దీనాలాపములు

53

పృథుశక్తిన్ గజ మా జలగ్రహముతోఁ బెక్కేండ్లు పోరాడి, సం
శిథిలంబై, తన లావు వైరిబలముం జింతించి, మిథ్యామనో
రథమిం కేటికి? దీని గెల్వ సరి పోరంజాలరా దంచు స
వ్యథమై యిట్లనుఁ బూర్వపుణ్యఫల దివ్యజ్ఞాన సంపత్తితోన్.

టీక:- పృథు = అధికమైన; శక్తిన్ = బలములతో; గజము = ఏనుగు; ఆ = ఆ; జలగ్రహము = మొసలి; తోన్ = తోటి; పెక్కు = అనేక; ఏండ్లు = సంవత్సరములు; పోరాడి = పోరాటము చేసి; సంశిథిలంబు = పూర్తిగా నశించినది; ఐ = అయ్యి; తన = తన యొక్క; లావు = సామర్థ్యము; వైరి = శత్రువు యొక్క; బలమున్ = శక్తిని; చింతించి = తరచి చూసికొని; మిథ్యా = వ్యర్థమైన; మనోరథము = కోరిక; ఇంక = ఇంకను; ఏటికిన్ = ఎందుకని; దీనిన్ = దీనిని; గెల్వన్ = జయించుటకు; సరి = సమానంగా; పోరన్ = పోరుటకు; చాలరాదు = సాధ్యము కాదు; అంచున్ = అనుచు; సవ్యథము = దుఃఖముతో కూడినవాడు; ఐ = అయ్యి; ఇట్లు = ఈ విధముగ; అనున్ = పలికెను; పూర్వ = పూర్వము చేసిన; పుణ్య = పుణ్యము యొక్క; ఫల = ఫలిత మైన; దివ్య = దివ్య మైన; జ్ఞాన = జ్ఞానము యనెడి; సంపత్తి = సంపదల; తోన్ = తోటి.

భావము:- గజరాజు గొప్పబలంతో అనేక సంవత్సరాలు యుద్ధం జేసి చేసి చివరికి చితికిపోయాడు. తన సత్తువ శత్రువు బలం సరిపోల్చుకొని ఆలోచించుకొన్నాడు

“అనవసర ప్రయత్నాలు నాకు ఎందుకు. దీనిని జయించటం, సరిసమంగా పోరాడటం రెండు నాకు సాధ్యంకాదు.” అని దుఃఖించాడు. పూర్వజన్మల పుణ్య ఫలం వలన కలిగిన మేలైన జ్ఞానం వల్ల అతడు ఈ విధంగా అనుకోసాగేడు.

54

"ఏరూపంబున దీని గెల్తు? నిటమీఁ దేవేల్పుఁ జింతింతు? నె
వ్వారిం జీరుదు? నెవ్వరడ్డ? మిఁక నీ వారిప్రచారోత్తమున్
వారింపం దగువార లెవ్వ? రఖిలవ్యాపార పారాయణుల్
లేరే? మ్రొక్కెద దిక్కుమాలిన మొఱాలింపం బ్రపుణ్యాత్మకుల్.

టీక:- ఏ = ఏ; రూపంబునన్ = రీతిగా; దీనిన్ = దీనిని; గెల్తున్ = జయించెదను; ఇటమీద = ఇకపైన; ఏ = ఏ; వేల్పున్ = దేవుడిని; చింతింతున్ = ప్రార్థించెదను; ఎవ్వారిన్ = ఎవరిని; చీరుదున్ = పిలిచెదను; ఎవ్వరు = ఎవరు; అడ్డము = శరణము; ఇక = ఇంక; ఈ = ఈ; వారిప్రచారోత్తమున్ = మొసలిని {వారిప్రచారోత్తము - వారి (నీటి)యందు ప్రచార (తిరిగెడి) ఉత్తము, మొసలి}; వారింపన్ = అడ్డగించుటకు; తగు = తగినట్టి; వారలు = వారు; ఎవ్వరు = ఎవరు; అఖిల = సమస్తమైన; వ్యాపార = కార్యములలోను; పారయణుల్ = నేర్పరులు; లేరే = లేరా; మ్రొక్కెదన్ = కొలిచెదను; దిక్కుమాలిన = నిరాశ్రయుడనై; మొఱ = మొరపెట్టగా; ఆలింపన్ = వినుటకు; ప్ర = విశేషమైన; పుణ్యాత్మకుల్ = పుణ్యవంతమైన ఆత్మ గలవారు.

భావము:- “ఈ మొసలిని ఏ విధంగా జయించగలను? ఇకపై నేను ఏదేవుణ్ణి ప్రార్థించను? ఎవరిని పిలవాలి? ఎవరు నన్ను రక్షిస్తారు? ఈ మహామొసలిని ఆపేశక్తి కలవారు ఎవరు? సర్వకార్యాలలో దిట్టలు గొప్పపుణ్యాత్ములు దిక్కులేని నా మొర వినేవారు లేకపోతారా. అట్టి వారికిమొరపెట్టుకుంటాను.

55

నానానేకపయూథముల్ వనములోనం బెద్దకాలంబు స
న్మానింపన్ దశలక్షకోటి కరిణీనాథుండనై యుండి మ
ద్ధానాంభః పరిపుష్ట చందన లతాంతచ్ఛాయలం దుండ లే
కీనీరాశ నిటేల వచ్చితి? భయం బెట్లోకదే యీశ్వరా!

టీక:- నానా = అనేకమైన; అనేకప = ఏనుగుల; యూధముల్ = సమూహములు; వనము = అడవి; లోనన్ = అందు; పెద్ద = చాలా; కాలంబు = కాలము; సన్మానింపన్ = గౌరవించుండగ; దశలక్షకోటి = పదిలక్షలకోట్ల; కరిణీ = ఆడ యేనుగులకు; నాథుండను = పతిని; ఐ = అయ్యి; ఉండి = ఉండి; మత్ = నా యొక్క; దానా = మద; అంబస్ = జలముచే; పరిపుష్ట = చక్కగా పెరిగిన; చందన = గంధపు; లతాంత = తీవ లందలి; ఛాయలన్ = నీడల; అందున్ = లో; ఉండన్ = ఉండ; లేక = లేకపోయి; ఈ = ఈ; నీర = నీటిపైని; ఆశన్ = ఆశతో; ఇటు = ఈవైపునకు; ఏల = ఎందుకు; వచ్చితిన్ = వచ్చితిని; భయంబు = భయమేస్తోంది; ఎట్లో = ఏలాగో; కదే = కదా; ఈశ్వరా = భగవంతుడా.

భావము:- చాలాకాలం నుంచి అడవిలో ఎన్నో ఏనుగు గుంపుల గౌరవాన్ని పొందుతు ఉన్నాను. పదిలక్షలకోట్ల ఆడ ఏనుగులకు నాథుడుగా ఉన్నాను. నా దానజలధారలతో బలంగా పెరిగిన మంచి గంధంచెట్ల నీడలలో సుఖంగా ఉండకుండ, నీటిమీద ఆశతో ఇక్కడకి ఎందుకు వచ్చాను. భగవంతుడా! చాలా భయం వేస్తోంది. ఎలానో ఏమిటో.

56

ఎవ్వనిచే జనించు జగ; మెవ్వని లోపల నుండు లీనమై;
యెవ్వని యందు డిందుఁ; బరమేశ్వరుఁ డెవ్వఁడు; మూలకారణం
బెవ్వఁ;డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు; సర్వముఁ దానయైన వాఁ
డెవ్వఁడు; వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేడెదన్.

టీక:- ఎవ్వని = ఎవని; చేన్ = వలన; జనించు = పుట్టునో; జగము = విశ్వము; ఎవ్వని = ఎవని; లోపలన్ = లోపల; ఉండున్ = ఉండునో; లీనము = కలిసిపోయినది; ఐ = అయ్యి; ఎవ్వని = ఎవని; అందున్ = లోనికి; డిందున్ = లయము పొందునో; పరమేశ్వరుడు = అత్యున్నతమైన ప్రభువు; ఎవ్వడు = ఎవడో; మూల = ప్రధాన; కారణంబు = కారణభూతుడు; ఎవ్వడు = ఎవడో; అనాదిమధ్యలయుడు = ఆదిమధ్యాంతలలో శాశ్వతముగా నుండువాడు; ఎవ్వడు = ఎవడో; సర్వమున్ = అన్నియును; తాన = తనే; ఐన = అయిన; వాడు = వాడు; ఎవ్వడు = ఎవడో; వానిన్ = వానిని; ఆత్మ = నా యొక్క; భవున్ = ప్రభువును; ఈశ్వరున్ = భగవంతుని; నేన్ = నేను; శరణంబు = శరణము; వేడెదన్ = కోరెదను.

భావము:- ఈ లోకమంతా ఎవరి వల్లనైతే పుడుతుందో; ఎవరిలో కలిసి ఉంటుందో; ఎవరి లోపల లయం అయిపోతుందో; ఎవరు పరమాత్ముడో; ఎవరు సృష్టికి ప్రధానకారణమై ఉన్నాడో; ఎవరైతే పుట్టడం, గిట్టడం, వాటి మధ్య అవస్థలు లేని శాశ్వతుడో; తుది, మొదలు మధ్య లేని అనంతుడో; ఎవరైతే సమస్తమైన సృష్టి తానే అయ్యి ఉంటాడో; అటువంటి స్వయంభువు, ప్రభువు ఐన భగవంతుణ్ణి నే శరణు కోరుతున్నాను.

57

ఒకపరి జగములు వెలి నిడి
యొకపరి లోపలికిఁ గొనుచు నుభయముఁ దానై
సకలార్థ సాక్షి యగు న
య్యకలంకుని నాత్మమూలు నర్థిఁ దలంతున్.

టీక:- ఒకపరి = ఒకసారి; జగములు = లోకములను; వెలినిడి = బయటపెట్టి, సృష్టించి; ఒకపరి = ఒకసారి; లోపలికిన్ = తన లోపలికి; కొనుచున్ = లయము చేసికొనుచు; ఉభయంబున్ = ఆ రెండు లోకములును; తాను = తనే; ఐ = అయ్యి; సకల = సమస్తమైన; అర్థ = విషయములకు; సాక్షి = అతీతముగ చూచువాడు; అగున్ = అయినట్టి; ఆ = ఆ; అకలంకున్ = దోషములు లేనివానికి; ఆత్మమూలున్ = పరమాత్మను; అర్థిన్ = కోరి; తలంతున్ = ధ్యానము చేసెదను;

భావము:- ఒకసారి లోకాలను సృష్టి చేసి, ఇంకొకసారి తనలో లయం చేసుకుంటు, ఆ లోకాలు రెండు తానే అయ్యి, అన్ని విషయాలను సాక్షీభూతంగా ఆలోకిస్తూ, ఆత్మలకు ఆత్మ అయిన ఆ పరమాత్మను ఆసక్తితో ధ్యానం చేస్తాను.

58

లోకంబులు లోకేశులు
లోకస్థులుఁ దెగినఁ దుది నలోకం బగు పెం
జీకటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెలుఁగు నతని నేసేవింతున్.

టీక:- లోకంబులున్ = లోకములు; లోకేశులున్ = లోకాలను పాలించేవారు; లోకస్థులు = లోకములలో నుండువారు; తెగిన = నశించిన తరువాత; తుదిన్ = కడపట; అలోకంబున్ = కనబడనిది, గుడ్డిది; అగు = అయిన; పెంజీకటి = గాఢాంధకారము; కిన్ = నకు;

అవ్వలన్ = ఆవతల; ఎవ్వండు = ఎవడు; ఏక = అఖండమైన; ఆకృతిన్ = రూపముతో; వెలుగున్ = ప్రకాశించునో; అతనిన్ = అతనిని; ఏన్ = నేను; సేవింతున్ = కొలచెదను.

భావము:- లోకాలు, లోకాలను పాలించేవారు, లోకాలలో ఉండేవారు అందరు నశించిన అనంతరం; ఆ కారు చీకట్లకు ఆవతల అఖండమైన రూపంతో ప్రకాశించే ఆ దేవుణ్ణి నేను సేవిస్తాను.

59

నర్తకుని భంగిఁ బెక్కగు
మూర్తులలో నెవ్వఁ డాడు? మునులు దివిజులుం
గీర్తింప నేర? రెవ్వని
వర్తన మొరు లెఱుఁగ? రట్టివాని నుతింతున్.

టీక:- నర్తకుని = నటుని; భంగిన్ = వలె; పెక్కు = అనేకమైనవి; అగు = అయిన; మూర్తుల్ = రూపముల; లోన్ = లోటి; ఎవ్వడు = ఎవరైతే; ఆడున్ = నడిపిస్తుంటాడో; మునులు = ఋషులు; దివిజులున్ = దేవతలు; కీర్తింపన్ = స్తుతించుటకు; నేరరు = సరిపోరో; ఎవ్వనిన్ = ఎవని; వర్తనమున్ = ప్రవర్తనలను; ఒఱులు = ఇతరులు; ఎఱుగరు = తెలియరో; అట్టి = అటువంటి; వానిన్ = వానిని; నుతింతున్ = సంస్తుతించెదను.

భావము:- అనేక వేషాలు వేసే నటుడి లాగ పెక్కు రూపాలతో ఎవరు క్రీడిస్తుంటాడో? ఋషులు దేవతలు ఎవరి గొప్పదనాన్ని వర్ణించ లేరో? ఎవరి ప్రవర్తన ఇతరులకు అగోచరంగా ఉంటుందో? అట్టి ఆ మహాదేవుణ్ణి నేను సంస్తుతిస్తాను.

60

ముక్తసంగులైన మునులు దిదృక్షులు
సర్వభూత హితులు సాధుచిత్తు
లసదృశవ్రతాఢ్యులైకొల్తు రెవ్వని
దివ్యపదము వాఁడు దిక్కు నాకు.

టీక:- ముక్త = పరిత్యజించిన; సంగులు = తగులములు గలవారు; ఐన = అయిన; మునులు = మునులు; దిదృక్షులున్ = దేవుని దర్శింపగోరువారు; సర్వ = సమస్తమైన; భూత = ప్రాణుల; హితులు = మేలు కోరువారు; సాధు = మంచి; చిత్తులు = మనసు

గలవారు; అసదృశ = సాటిలేని; వ్రత = దీక్షలు కలవారిలో; ఆఢ్యులు = శ్రేష్ఠులు; ఐ = అయ్యి; కొల్తురు = సేవించెదరు; ఎవ్వని = ఎవని; దివ్య = దివ్యమైన; పదమున్ = పాదములను; వాడు = వాడు; దిక్కు = శరణము; నాకు = నాకు.

భావము:- ప్రపంచంతో సర్వ సంబంధాలు వదలివేసిన మునులు, భగవద్దర్శనం కోరేవారు, సమస్తమైన జీవుల మేలు కోరేవారు, మంచి మనసు కలవారు సాటిలేని వ్రతాలు ధరించి ఎవరి పాదాలను సేవిస్తారో అట్టి భగవంతుడు నాకు దిక్కు అగు గాక.

61

భవము దోషంబు రూపంబుఁ గర్మంబు నా;
హ్వాయమును గుణము లెవ్వనికి లేక
జగములఁ గలిగించు సమయించు కొఱకునై;
నిజమాయ నెవ్వఁ డిన్నియునుఁ దాల్చు
నాపరేశునకు, ననంతశక్తికి, బ్రహ్మ;
కిద్ధరూపికి, రూపహీనునకునుఁ,
జిత్రచారునికి, సాక్షికి, నాత్మరుచికినిఁ;
బరమాత్మునకుఁ, బరబ్రహ్మమునకు,
మాటలను నెఱుకల మనములఁ జేరంగఁ
గాని శుచికి, సత్త్వగమ్యుఁ డగుచు
నిపుణుఁ డైనవాని నిష్కర్మతకు మెచ్చు
వాని కే నొనర్తు వందనములు.

టీక:- భవమున్ = పుట్టుక; దోషంబున్ = పాపము; రూపంబున్ = ఆకారము; కర్మంబున్ = కర్మలు; ఆహ్వాయమును = పేరు; గుణములు = గుణములు; ఎవ్వని = ఎవని; కిన్ = కైతే; లేక = లేకుండగ; జగములన్ = భువనములను; కలిగించు = సృష్టించుట; సమయించు = నశింపజేయుటల; కొఱకున్ = కోసము; ఐ = అయ్యి; నిజ = తన; మాయన్ = మాయచే; ఎవ్వడు = ఎవడైతే; ఇన్నియున్ = వీటన్నిటిని; తాల్చున్ = ధరించునో; ఆ = ఆ; పరేశున్ = అత్యున్నత ప్రభువు; కున్ = నకు; అనంతశక్తి = అంతులేని శక్తిమంతుని; కిన్ = కి; బ్రహ్మ = సృష్టికర్త; కిన్ = కి; ఇద్ధరూపి = సర్వాధిష్ఠానమైనవాని {ఇద్ధరూపి – ప్రసిద్ధమైన రూపములు కలవాడు.

సర్వాధిష్ఠానమైనవాడు}; కిన్ = కి; రూపహీనున్ = రూప మేదీ లేనివాని; కునున్ = కు; చిత్రచారుని = విచిత్రమైన వర్తన గలవాని; కిన్ = కి; సాక్షి = సర్వమును చూచువాని; కిన్ = కి; ఆత్మరుచి = స్వయంప్రకాశుని; కినిన్ = కి; పరమాత్మున = అత్యున్నత ఆత్మ యైనవాని; కున్ = కు; పరబ్రహ్మమున్ = అతీతమైనబ్రహ్మ; కున్ = కి;
మాటలను = భాషలో; ఎఱుకలన్ = తెలివిడితో; మనములన్ = ఊహలతో; చేరంగన్ = అందుకొన; కాని = సాధ్యముకాని; శుచి = పరిశుద్ధుని; కిన్ = కి; సత్త్వ = సత్త్వగుణములతో; గమ్యుడు = దరిజేర గలవాడు; అగుచున్ = అగుచు; నిపుణుడు = నేర్పరుడు; ఐన = అయినట్టి; వాని = వాని యొక్క; నిష్కర్మత = ఫలాపేక్షలేని కర్మల; కున్ = కు; మెచ్చున్ = మెచ్చుకొను; వాని = వాని; కిన్ = కి; నేన్ = నేను; ఒనర్తున్ = చేసెదను; వందనములు = నమస్కారములు.
<u>భావము</u>:- భగవంతుడికి పుట్టుక, పాపము, ఆకారం, కర్మలు, నామలు, గుణాలు లేవు. అతడు లోకాలను పుట్టించడానికి, నశింపజేయడానికి తన మాయా ప్రభవంతో ఇవన్నీ ధరిస్తాడు. అతడు పరమేశ్వరుడు, అంతులేని శక్తి కలవాడు, బ్రహ్మ, నిండైన రూపం గలవాడు, ఏ రూపం లేనివాడు, చిత్రమైన ప్రవర్తన కల వాడు, సర్వసాక్షి, ఆత్మప్రకాశ మైన వాడు, పరమాత్మ, పరబ్రహ్మ, మాటలకు ఊహలకు అందని వాడు, పరిశుద్ధుడు, సత్వగుణంతో దరిజేర దగినవాడు మరియు నేర్పరులు చేసే ఫలాపేక్ష లేని కర్మలను మెచ్చువాడు అయినట్టి ఆ దేవదేవునికి నేను నమస్కారాలు చేస్తాను.

62

<u>శాం</u>తున కపవర్గ <u>సౌ</u>ఖ్య సంవేదికి;
<u>ని</u>ర్వాణ భర్తకు <u>ని</u>ర్విశేషు
<u>న</u>కు; ఘోరునకు గూఢు<u>న</u>కు గుణధర్మికి;
<u>సౌ</u>మ్యున కధిక విజ్ఞాన మయున
<u>క</u>ఖిలేంద్రియద్రష్ట <u>క</u>ధ్యక్షునకు బహు;
<u>క్షే</u>త్రజ్ఞునకు దయా<u>సిం</u>ధుమతికి
<u>మూ</u>లప్రకృతి కాత్మ <u>మూ</u>లున కఖిలేంద్రి;
<u>య</u> జ్ఞాపకునకు దుః<u>ఖాం</u>త కృతికి
<u>నె</u>ఱి నసత్య మనెడి <u>నీ</u>డలో వెలుఁగుచు

నుండు నెక్కటికి, మహోత్తరునకు,
నిఖిల కారణునకు, నిష్కారణునకు న
మస్కరింతు నన్ను మనుచు కొఱకు.

టీక:- శాంతున్ = శాంతి స్వరూపుని; కిన్ = కి; అపవర్గ = మోక్ష మందలి; సౌఖ్య = సౌఖ్యమును; సంవేది = బాగుగా తెలిసినవాని; కిన్ = కి; నిర్వాణ = మోక్షమునకు; భర్త = అధిపతి యైనవాని; కున్ = కి; నిర్ విశేషున్ = తనకు మించిన విశిష్టతలు లేనివాని; కున్ = కి; ఘోరున్ = దుష్టులకు భయంకరుని; కున్ = కి; గూఢున్ = సంసారబద్ధులకు అందరానివాని; కున్ = కు; గుణధర్మి = త్రిగుణముల ధర్మము గలవాని; కిన్ = కి; సౌమ్యున్ = వైషమ్యాదులు లేనివాని; కిన్ = కి; అధిక = విశేషమైన; విజ్ఞానమయున్ = విశిష్ఠ జ్ఞానము గలవాని; కిన్ = కి; అఖిల = సర్వ; ఇంద్రియ = ఇంద్రియ కార్యములను; ద్రష్ట = సాక్షిగా చూచెడివాని; కున్ = కి; అద్యక్షున్ = నిర్వికార అధిపతి; కిన్ = కి; బహు = వివిధము లైన; క్షేత్ర = జీవాత్మలకు; జ్ఞున్ = ఏకైక జ్ఞాత; కున్ = కు; దయ = దయ యనెడి; సింధు = సముద్రమువంటి; మతి = మనసు కలవాని; కిన్ = కి; మూలప్రకృతి = మూలపురుషుని {మూల ప్రకృతి - మూలాధార (ప్రధాన) ప్రకృతి (ఉపాదానభూతము కారణవిశేషము) ఐనవాడు}; కిన్ = కి; అఖిల = సకల; ఇంద్రియ = ఇంద్రియములను; జ్ఞాపకున్ = నడిపించెడివాని; కున్ = కి; దుఃఖ = దుఃఖమును; అంత = నశింపజేయుటలో; కృతి = నేర్పరుని; కిన్ = కి.
నెఱిన్ = చక్కగా; అసత్యము = అసత్యము; అనెడి = అనెడి; నీడ = నీడ; లో = లో; వెలుగుచున్ = ప్రకాశించుతు; ఉండు = ఉండెడి; ఎక్కటి = ఒంటరి; కిన్ = కి; మహోత్తరున్ = మిక్కిలి గొప్పవాని; కున్ = కి; నిఖిల = సమస్తమునకు; కారణున్ = బీజమైనవాని; కున్ = కి; నిష్కారణున్ = తనకి కారణభూతులు లేనివాని; కున్ = కి; నమస్కరింతున్ = నమస్కరించెదను; నన్ను = నన్ను; మనుచు = కాపాడుట; కొఱకు = కోసము.

భావము:- భగవంతుడు శాంతస్వరూపుడు. పరలోక సౌఖ్యప్రదాత. మోక్షానికి అధిపతి. నిర్విశేషుడు. దుష్టులకు భయంకరుడు. సంసారబద్ధులకు అందనివాడు. సర్వ గుణ ధర్మాలు కలవాడు. సరళ స్వభావి. విశేషమైన జ్ఞానము కలవాడు. సర్వేంద్రియాల కార్యాలను చూసేవాడు. సమస్తానికి ప్రభువు. బహు క్షేత్రజ్ఞుడు. దయారసానికి సముద్రం

వంటివాడు. సర్వానికి ఆది మూల పురుషుడు. ఆత్మకు ఆధారమైనవాడు. సకల ఇంద్రియాలకు నియామకుడు. దుఃఖాన్ని తొలగించేవాడు. మాయ అనే నీడతో ప్రకాశించే బహు నేర్పరి. మిక్కిలి గొప్పవాడు. సమస్తానికి ఆది బీజం అయినవాడు. తనకి మూల కారణం ఏది లేనివాడు. అట్టి ఆ దేవ దేవునికి నన్ను కాపాడ మంటూ నమస్కరిస్తున్నాను.

63

యోగాగ్ని దగ్ధకర్మలు
యోగీశ్వరు లే మహాత్ము నొండెఱుఁగక స
ద్యోగవిభాసిత మనముల
బాగుగ వీక్షింతు రట్టి పరము భజింతున్.

టీక:- యోగా = యోగ మనెడి; అగ్ని = నిప్పులలో; దగ్ధ = కాల్చివేయబడిన; కర్మలు = పూర్వకర్మలు గలవారు; యోగి = యోగి; ఈశ్వరులు = శ్రేష్ఠులు; ఏ = ఏ; మహాత్మున్ = గొప్పవానిని; ఒండు = ఇతర మేమి; ఎఱుంగక = ఎరుగక; సత్ = చక్కటి; యోగ = యోగాభ్యాసముచే; విభాసిత = ప్రకాశించెడి; మనములన్ = మనసు లందు; బాగుగన్ = చక్కగా; వీక్షింతురు = దర్శింతురో; అట్టి = అటువంటి; పరమున్ = సర్వాతీతుని; భజింతున్ = సేవించెదను.

భావము:- యోగీంద్రులు యోగం అనే అగ్నితో తమ సర్వ పూర్వ కర్మలను కాల్చివేసి. ఇతరమైనది మరేది తలచకుండ ప్రకాశించే తమ మనసులలో ఆ దేవదేవుని చూస్తు ఉంటారు. అట్టి ఆ మహానుభావుడిని నేను సేవిస్తాను.

64

సర్వాగమామ్నాయ జలధికి, నపవర్గ;
మయునికి, నుత్తమ మందిరునకు,
సకలగుణారణిచ్ఛన్న బోధాగ్నికిఁ;
దనయంత రాజిల్లు ధన్యమతికి,
గుణలయోద్దీపిత గురు మానసునకు, సం;
వర్తితకర్మనిర్వర్తితునకు,
దిశలేని నా బోఁటి పశువుల పాపంబు;
లడఁచువానికి, సమస్తాంతరాత్మున

డ్డైవెలుంగువాని, క్షచ్ఛిన్నునకు, భగ
వంతునకుఁ, దనూజ పశు నివేశ
దారసక్తు లయినవారి కందఁగరాని
వాని కాచరింతు వందనములు.

టీక:- సర్వ = సమస్తమైన; ఆగమ = శాస్త్రములకు; ఆమ్నాయ = వేదములకు; జలధి = సముద్రమువంటివాని; కిన్ = కి; అపవర్గ = మోక్షము యొక్క; మయుని = స్వరూపమైనవాని; కిన్ = కి; ఉత్తమ = ఉత్తమత్వమునకు, పుణ్యు లందు; మందిరున్ = నివాసమైనవాని, వసించువాని; కిన్ = కి; సకల = సర్వ; గుణా = గుణములు యనెడి; ఆరణిన్ = రాపిడికొయ్యలలో; ఛన్న = దాగి యున్న; బోధ = జ్ఞానము యనెడి; అగ్ని = అగ్ని వంటివాని; కిన్ = కి; తనయంత = తనంతతానే; రాజిల్లు = ప్రకాశించెడి; ధన్యమతి = ధన్యమైన జ్ఞానము గలవాని; కిన్ = కి; గుణ = గుణములు; లయ = లయ మగుటచేత; ఉద్దీపిత = ప్రకాశించెడి; గురు = గొప్ప; మానసున్ = మనసు గలవాని; కున్ = కి; సంవర్తిత = పునర్జన్మలకు కారణమైన; కర్మ = కర్మను; నిర్వర్తితున్ = మరలించెడివాని; కున్ = కి; దిశ = దిక్కు; లేని = లేనట్టి; నా = నా; పోటి = వంటి; పశువుల = జంతువుల; పాపంబుల్ = పాపములను; అడచు = అణచివేయు; వాని = వాని; కిన్ = కి; సమస్త = సమస్తము నందును; అంతరాత్ముడు = లోనుండెడి ఆత్మ యైనవాడు; ఐ = అయ్యి.

వెలుంగు = ప్రకాశించెడి; వాని = వాని; కిన్ = కి; అవిచ్ఛిన్నున్ = నాశనము లేనివాని; కిన్ = కి; భగవంతున = షడ్గుణైశ్వర్యములు కలుగుటచే పూజనీయు డైనవాని {షడ్గుణములు - 1వాత్సల్యము 2భవశోషణము 3ఉదారత్వము 4అభయప్రదానము 5ఆపత్కాల సంరక్షణము 6అక్షయపదము అనెడివి విష్ణుదేవుని షడ్గుణములు (మరియొకవిధముగ) భగవంతుని షడ్గుణైశ్వర్యములు 1మహాత్మ్యము 2ధైర్యము 3యశస్సు 4శ్రీ 5జ్ఞానము 6వైరాగ్యము}; కున్ = కి; తనూజ = సంతానము; పశు = పశువులు; నివేశ = ఇండ్లు; దార = భార్యల యందు {దార - వ్యు. దౄ – వాదారణే , దౄ (ణిచ్) – ఆర్ – టాప్, కృ.ప్ర., అన్నదమ్ముల నుండి వేఱుపఱచునది, భార్య}; సక్తులు = వ్యామోహము గలవారు; అయిన = ఐన; వారి = వారల; కిన్ = కు; అందరాని = తెలియ సాధ్యము

గాని; వానిన్ = వాని; కిన్ = కి; ఆచరింతున్ = చేసెదను; వందనములు = నమస్కారములు.

భావము:- పరమేశ్వరుడు సమస్త ఆగమాలు వేదాలు అనే నదులకు సంగమరూప మైన సముద్రము వంటివాడు. మోక్షస్వరూపుడు. గొప్ప గుణాలకు నిలయ మైన వాడు. ఆరణి కొయ్యలలోని అగ్నివలె సుగుణాలలో దాగి ఉండేవాడు. స్వయం ప్రకాశకుడు. గొప్ప మనస్సు కలవాడు. ప్రళయాన్ని సృష్టిని నడిపేవాడు. నాలాంటి ఏ దిక్కులేని జీవుల పాపాలను శమింపజేసేవాడు. సర్వులలోను ఆత్మ యై వెలగువాడు. నాశనం లేనివాడు. పూజింప దగినవాడు. భార్యా పుత్రులు ఇల్లు పశువులు వంటి వాటి యందు ఆసక్తి కలవారికి అందరానివాడు. అటువంటి ప్రభువునకు నమస్కారాలు చేస్తాను.

65

మఱియును.

టీక:- మఱియునున్ = ఇంకను.

భావము:- ఇంతేకాకుండా,

66

వరధర్మకామార్థ వర్జితకాములై;
విబుధు లెవ్వాని సేవించి యిష్ట
గతిఁ బొందుదురు? చేరి కాంక్షించువారి క;
వ్యయ దేహ మిచ్చు నెవ్వాఁడు కరుణ?
ముక్తాత్ము లెవ్వని మునుకొని చింతింతు? ;
రానందవార్ధి మగ్నాంతరంగు
లేకాంతు లెవ్వని నేమియుఁ గోరక;
భద్రచరిత్రంబుఁ బాడుచుందు?
రామహేశు, నాద్యు, నవ్యక్తు, నధ్యాత్మ
యోగగమ్యుఁ, బూర్ణు, నున్నతాత్ము,
బ్రహ్మమయిన వానిఁ, బరుని, నతీంద్రియు,
నీశు, స్థూలు, సూక్ష్ము నేభజింతు.

టీక:- వర = ఉత్తములైన; ధర్మకామార్థ = పురుషార్థ త్రయము యెడ {పురుషార్థములు - 4 అవి ధర్మార్థకామము లనెడి త్రయము మరియు మోక్షము}; వర్జిత = విడిచిన; కాములు = ఆసక్తి గలవారు; ఐ = అయ్యి; విబుధులు = జ్ఞానులు; ఎవ్వని = ఎవని నైతే; సేవించి = కొలిచి; ఇష్ట = కోరుకొన్న; గతిన్ = ఉత్తమగతిని; పొందుదురు = పొందెదరో; చేరి కాంక్షించు = ఆశ్రయించు; వారి = వారల; కిన్ = కి; అవ్యయ = నాశములేని; దేహమున్ = శరీరమును; ఇచ్చున్ = ఇచ్చెడివాడు; ఎవ్వడు = ఎవడో; కరుణన్ = దయతో; ముక్త = ముక్తు లైన {ముక్తులు - సంసారబంధములనుండి విముక్తి పొందినవారు}; ఆత్ములు = వారు; ఎవ్వని = ఎవని నైతే; మునుకొని = పూని; చింతింతురు = ధ్యానించెదరో; ఆనంద = ఆనంద మనెడి; వార్ధి = సముద్రము నందు; మగ్న = మునిగిన; అంతరంగులు = మనస్సులు గలవారు; ఏకాంతులు = అనన్యభక్తులు; ఎవ్వనిన్ = ఎవరి నైతే; ఏమియున్ = ఏదీ; కోరక = కోరకుండగ; భద్ర = భద్రత నిచ్చెడి; చరిత్రంబు = చరిత్రలను; పాడుచుందురు = కీర్తించెదరో; ఆ = ఆ. మహా = గొప్ప; ఈశున్ = ప్రభువును; ఆద్యున్ = ఆదిదేవుని; అవ్యక్తున్ = తెలిసికొన వీలుకాని వాని; అధ్యాత్మ = పరబ్రహ్మజ్ఞాన; యోగ = యోగసాధనచే; గమ్యున్ = చేరదగ్గవాని; పూర్ణున్ = పరిపూర్ణుని; ఉన్నతాత్మున్ = పరమాత్ముని; బ్రహ్మము = బ్రహ్మము; అయిన = తానే యయిన; వానిన్ = వానిని; పరుని = సర్వమున కితరమైన వాని; అతీంద్రియున్ = ఇంద్రియముల కతీతమైన వాని; ఈశున్ = జగన్నియంతను; దూరున్ = ప్రకృతికి దూరమైనవాని; సూక్ష్మున్ = పరమాణురూపుని; నేన్ = నేను; భజింతున్ = స్తుతింతును.

భావము:- ఇంతేకాకుండా, దేవదేవుడు ధర్మం కామం ధనం అన్నిటి మీద ఆశలు విడిచేసిన పండితుల పూజ లందుకొని వారు కోరుకొన్న ఉత్తమ వరాలు ప్రసాదిస్తాడు. భక్తితో దరిజేరి కోరిన వారికి దయతో నాశనంలేని శరీరాన్ని ఇస్తాడు. ఆనంద సాగరంలో మునిగిన మనస్సులు కల ఏకాంతిక ముక్తులు ఆ దేవదేవుని అనునిత్యం ఆరాధిస్తారు. వారు దేవదేవుని పవిత్ర మైన చరిత్రను కోరికలేమి లేకుండ కీర్తిస్తుంటారు. ఆ మహా దేవుడు సృష్టికన్న ఆద్యుడు. ఇంద్రియ జ్ఞానానికి అందనివాడు, అధ్యాత్మ యోగం వలన చేరదగినవాడు. పరిపూర్ణుడు. మహాత్ముడు. బ్రహ్మస్వరూపుడు. సర్వానికి

పరమైనవాడు. ఇంద్రియములకు అతీతమైనవాడు. స్థూలస్వరూపుడు, సూక్ష్మ రూపుడు. అట్టువంటి ఆ పరాత్పరుని నేను సేవిస్తాను.

67

అని మఱియు నిట్లని వితర్కించె.

టీక:- అని = అని; మఱియున్ = ఇంకను; ఇట్లు = ఇలా; అని = అని; వితర్కించె = తరచి పలికెను.

భావము:- గజరాజు ఇంకా ఇలా అనుకోసాగాడు.

68

పావకుండర్చుల, భానుండు దీప్తుల;
నెబ్భంగి నిగిడింతు, రెట్ల డంతు
రాక్రియ నాత్మకరావళిచేత బ్ర;
హ్మాదుల, వేల్పుల, నఖిలజంతు
గణముల, జగముల, ఘన నామ రూప భే;
దములతో మెఱయించి త్రగ నడంచు,
నెవ్వఁడు మనము బుద్ధీంద్రియంబులుఁ దాన;
యై గుణ సంప్రవాహంబు నెఱపు,
స్త్రీనపుంసక పురుష మూర్తియునుఁ గాక,
తిర్య గమర నరాది మూర్తియునుఁ గాక,
కర్మ గుణ భేద సదసత్ప్రకాశిఁ గాక,
వెనుక నన్నియుఁ దా నగు విభుఁ దలంతు.

టీక:- పావకుండు = అగ్ని; అర్చులన్ = జ్వాలలను; భానుండు = సూర్యుడు; దీప్తులన్ = వెలుగును; ఎబ్భంగిన్ = ఏవిధముగనైతే; నిగిడింతురు = ప్రసరింపజేసెదరో; ఎట్లు = ఏ విధముగ; అడంతురు = అణచివేయుదురో; ఆ = ఆ; క్రియన్ = విధముగనే; ఆత్మ = తన; కరావళి = కిరణముల; చేతన్ = చేత; బ్రహ్మ = బ్రహ్మదేవుడు; ఆదులన్ = మున్నగువారిని; వేల్పులన్ = దేవతలను; అఖిల = సమస్తమైన; జంతు = జీవ; గణములన్ = జాలమును; జగములన్ = భువనములను; ఘన = గొప్ప; నామ = పేర్లు; రూప = స్వరూపముల; భేదముల్ = భేదముల; తోన్ = తోటి; మెఱయించి = పుట్టించి;

తగన్ = తగినట్లు; అడంచున్ = అణచివేయునో; ఎవ్వడు = ఎవడైతే; మనమున్ = మనసు; బుద్ధి = బుద్ధి; ఇంద్రియంబులున్ = ఇంద్రియములును; తాన = తనే; ఐ = అయ్యి; గుణ = త్రిగుణములను {త్రిగుణములు - 1సత్త్వ 2రజస్సు 3తమస్సు}; సంప్రవాహంబున్ = చిక్కటి వ్యాప్తిని; నెఱపున్ = నిర్వహించునో.

స్త్రీ = స్త్రీలింగ; నపుంసక = నపుంసకలింగ; పురుష = పుల్లింగ; మూర్తియునున్ = రూపము; కాక = కాకుండగ; తిర్యక్ = జంతువుల; అమర = దేవతలను; నర = నరుల; ఆది = మొదలగువారి; మూర్తియునున్ = రూపును; కాక = కాకుండగ; కర్మ = కర్మల; గుణ = గుణముల; భేద = భేదములకు; సదసత్ = ఉండుట లేకుండును; ప్రకాశి = బయలుపరచువాడు; కాక = కాకుండగ; వెనుకన్ = ఆ పిమ్మట; అన్నియున్ = సర్వమును; తాన్ = తనే; అగు = అయ్యెడి; విబుధున్ = విజ్ఞానిని; తలంతు = ధ్యానించెదను.

<u>భావము</u>:- అగ్ని మంటలను, సూర్యుడు వెలుగుని ప్రసరింజేసి మళ్ళీ శమింపజేసే విధంగానే భగవంతుడు తన కిరణాలచేత బ్రహ్మదేవుడు మొదలైన దేవత లను, సకల జీవరాసులను, సమస్త లోకాలను నానా విధాలైన నామ రూప భేదాలతో సృష్టించి లయింపజేస్తాడు. ఆయన మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు అన్నీ తానే అయ్యి గుణాలను ప్రవర్తింప జేస్తాడు. ఆయన స్త్రీ, పురుష, నపుంసక, జంతు, దేవతల, నరులు మొదలగు వారిలో వేటి ఒక్క రూపము కలవాడు కాదు. ఆయన కర్మ గుణ భేదాలకి సత్తు అసత్తులకి అతీతుడు. అంతే కాకుండా అవన్ని కూడ తానే అయ్యి ఉంటాడు. అటువంటి ఆ ప్రభువును నేను స్మరిస్తాను.

69

కలఁడందురు దీనుల యెడఁ,
<u>గ</u>లఁడందురు పరమయోగి <u>గ</u>ణముల పాలం,
గలఁడందు రన్ని దిశలను,
<u>గ</u>లఁడు కలం డనెడి వాఁడు <u>గ</u>లఁడో లేఁడో?

<u>టీక</u>:- కలడు = ఉన్నాడు; అందురు = అనెదరు; దీనుల = ఆర్తుల; యెడన్ = వెంట; కలడు = ఉంటాడు; అందురు = అనెదరు; పరమ = అత్యుత్తమమైన; యోగి = యోగుల; గణముల = సమూహముల; పాలన్ = అందు; కలడు = ఉన్నాడు; అందురు

= అనెదరు; అన్ని = సర్వ; దిశలను = దిక్కు లందును; కలడు = ఉన్నాడు; కలండు = ఉన్నాడు; అనెడి = అనబడెడి; వాడు = వాడు; కలడో = ఉన్నాడో; లేడో = లేడో.

భావము:- దేవుడు ఆర్తు లైన వారి వెంట ఉంటాడు అని అంటారు. ఉత్తము లైన యోగుల చెంత ఉంటా డని అంటారు. అన్ని దిక్కుల లోను ఉంటా డంటారు. "ఉన్నాడు ఉన్నాడు" అనే ఆ దేవుడు మరి ఉన్నాడో! లేడో!

70

కలుగఁడే నాపాలికలిమి సందేహింపఁ;
గలిమిలేములు లేకఁ గలుగువాఁడు?
నాకడ్డపడ రాఁడె నలి నసాధువులచేఁ;
బడిన సాధుల కడ్డపడెడువాఁడు?
చూడఁడే నా పాటుఁ జూపులఁ జూడకఁ;
జూచువారలఁ గృపఁ జూచువాఁడు?
లీలతో నా మొఱాలింపఁడే మొఱఁగుల;
మొఱ లెఱుంగుచుఁ దన్ను మొఱఁగువాఁడు?
అఖిల రూపముల్ దనరూప మైనవాఁడు
ఆదిమధ్యాంతములు లేక యడరువాఁడు
భక్తజనముల దీనుల పాలివాఁడు
వినఁడె? చూడఁడె? తలఁపడె? వేగ రాఁడె?

టీక:- కలుగడే = సహాయముగా రాడేమి; నా = నా; పాలిన్ = విషయములో; కలిమి = ఉండుటను; సందేహింపన్ = అనుమానించను; కలిమి = సంపద కలుగుట; లేములు = పేదరికములు; లేకన్ = చూడక; కలుగు = సహాయపడెడి; వాడు = వాడు; నాకున్ = నా యాపదకు; అడ్డపడన్ = సహాయపడుటకు; రాడె = రాడా యేమి; నలిన్ = అధికముగ; అసాధువుల్ = దుర్జనుల; చేన్ = చేతిలో; పడిన = చిక్కినట్టి; సాధుల్ = సజ్జనుల; కున్ = కు; అడ్డపడెడి = సహాయపడెడి; వాడు = వాడు; చూడడే = చూడడా యేమి; నా = నా యొక్క; పాటున్ = దురవస్థను; చూపులన్ = ఇతర చూపులు; చూడక = చూడకనే; చూచువారలన్ = తననే చూచువారిని; కృపన్ = దయతో; చూచువాడు = చూచెడివాడు; లీలన్ = లీల; తోన్ = తోటి; నా = నా యొక్క; మొఱన్ =

ఆర్తనాదమును; ఆలింపడే = వినడా యేమి; మొఱగుల = దీనుల; మొఱలు = ఆర్తనాదములను; ఎఱుంగుచున్ = తెలియుచు; తన్ను = తననుతానే; మొఱగు = మరచు; వాడు = వాడు.

అఖిల = సర్వ; రూపముల్ = రూపములు; తన = తన యొక్క; రూపము = స్వరూపము; ఐన = అయిన; వాడు = వాడు; ఆది = మొదలు; మధ్య = మధ్య; అంతములున్ = తుదిలు; లేక = లేకుండగ; అడరు = అతిశయించెడి; వాడు = వాడు; భక్తజనములన్ = భక్తు లైనవారిని; దీనులన్ = దీనుల; పాలి = అండగా నుండెడి; వాడు = వాడు; వినడె = వినడా యేమి; చూడడె = చూడడా యేమి; తలపడె = రక్షింప తలచడా యేమి; వేగన్ = శ్రీఘ్రమే; రాడె = రాడా యేమి.

భావము:- నా విషయంలో ఆ భగవంతుడు గురించి అనుమానించాల్సిన పని లేదు. అతడు ఐశ్వర్యం పేదరికం లాంటివి చూడకుండా అందరికి అండగా ఉంటాడు. కాబట్టి నాకు అండగా ఉంటాడు. దుర్జనుల చేతిలో చిక్కుకున్న సజ్జనులకు సాయపడతాడు. అందువల్ల నాకు సాయం చేస్తాడు. బయటి చూపుల వదిలిపెట్టి తననే చూసేవారిని దయతో చూస్తాడు. కనుక నా కష్టాన్ని చూస్తాడు. దీనుల మొరలు విని తన్ను తానే మరచి పోతాడు కదా. నా మొర తప్పక వింటాడు. అన్ని రూపాలు ఆయన రూపాలే. మొదలు నడుమ తుద అన్నవి ఆయనకు లేవు. భక్తులకు దిక్కులేని వారికి ఆయనే ఆధారం. మరి అటువంటి ప్రభువు ఇంకా నా మొర వినడేం? నా బాధ చూడడేం? నన్ను దయ చూడడేం? తొందరగా రాడేం?

71

విశ్వకరు విశ్వదూరుని
విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మప్రభు
నీశ్వరునిం బరమపురుషు నేభజియింతున్."

టీక:- విశ్వ = జగత్తుని; కరున్ = సృష్టించెడివానిని; విశ్వ = జగత్తుకి; దూరునిన్ = అతీతముగ నుండువానిని; విశ్వ = జగత్తు; ఆత్మునిన్ = తన స్వరూపమైన వానిని; విశ్వ = లోక మంతటికి; వేద్యున్ = తెలుసుకొనదగ్గ వానిని; విశ్వున్ = లోకమే తానైన వానిని; అవిశ్వున్ = లోకముకంటె భిన్నమైనవాని; శాశ్వతున్ = శాశ్వతముగ నుండు వానిని; అజున్ = పుట్టుక లేనివానిని; బ్రహ్మ = బ్రహ్మదేవునికి; ప్రభున్ = ప్రభువైన వానిని;

ఈశ్వరునిన్ = లోకము నడిపించువానిని; పరమ = సర్వశ్రేష్ఠమైన; పురుషున్ = పురుషుని; నేన్ = నేను; భజియింతున్ = స్తుతించెదను.

భావము:- ప్రభువు లోకాన్ని సృష్టించేవాడు. లోకులు అందుకోలేని వాడు. లోకానికి అంతరాత్మ అయిన వాడు. లోకంలో బాగా తెలుసుకోదగిన వాడు లోకమే తానైన వాడు. లోకాతీతుడు. ఎల్లప్పుడు ఉండేవాడు. పుట్టుక లేనివాడు. బ్రహ్మదేవునికి అధి నాయకుడు. లోకాన్ని నడిపించేవాడు. పరమాత్మ. అట్టి ఆది పురుషుని నేను ఆరాధిస్తాను.

72

అని పలికి, తన మనంబున నగ్గజేంద్రుం డీశ్వర సన్నిధానంబు కల్పించుకొని యిట్లనియె.

టీక:- అని = అని; పలికి = అనుచు; తన = తన యొక్క; మనంబునన్ = మనసులో; ఆ = ఆ; గజేంద్రుండు = గజేంద్రుడు; ఈశ్వర = భగవంతుని; సన్నిధానంబున్ = ఆశ్రయమును; కల్పించుకొని = ఏర్పరుచుకొని; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఈ విధంగా గజేంద్రుడు భావించుకొని భగవంతుని తన మనస్సులో సంకల్పించుకొని ఇలా ప్రార్థంచాడు.

73

"లా**వొ**క్కింతయు లేదు; ధైర్యము విలోలంబయ్యె; బ్రాణంబులున్
ఠా**వుల్**దప్పెను; మూర్ఛ వచ్చెఁ; దనువున్ డస్సెన్; శ్రమంబయ్యెడిన్;
నీ**వే**తప్ప నితఃపరం బెఱుఁగ; మన్నింపందగున్ దీనునిన్;
రా**వే!**యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!

టీక:- లావు = శక్తి; ఒక్కింతయున్ = కొంచెము కూడ; లేదు = లేదు; ధైర్యము = ధైర్యము; విలోలంబు = తగ్గి; అయ్యెన్ = పోయింది; ప్రాణంబులున్ = ప్రాణములు; ఠావుల్ = స్థానములనుండి; తప్పెన్ = చలించిపోతున్నాయి; మూర్ఛ = మగత; వచ్చెన్ = వస్తున్నది; తనువున్ = శరీరము; డస్సెన్ = అలసిపోయింది; శ్రమంబున్ = కష్టముగా; అయ్యెడిన్ = ఉన్నది; నీవే = నీవు మాత్రము; తప్పన్ = తప్పించి; ఇతఃపరంబు = మరింకొకరుని; ఎఱుంగన్ = తెలియను; మన్నింపన్ = ఆదుకొన; తగున్ = తగినవాడను; దీనునిన్ = దీనావస్థ నున్నవాడను; రావే = రమ్ము; ఈశ్వర =

భగవంతుడ; కావవే = కరుణించుము; వరద = వరముల నిచ్చెడివాడ; సంరక్షింపు = కాపాడుము; భద్రాత్మక = శుభమే తానైనవాడ.

భావము:- దేవా! నాలో శక్తి కొంచం కూడ లేదు. ధైర్యం సడలి పోయింది. ప్రాణాలు కూడ కదలిపోతున్నాయి. మూర్ఛ వచ్చేస్తూ ఉంది. శరీరం స్రుక్కిపోయింది. బాగా అలసటగా ఉంది. నాకు నీవు తప్ప వేరే ఇతరు లెవ్వరు నాకు తెలియదు. నీవే దిక్కు. ఆర్తితో ఉన్న నన్ను ఆదుకోవయ్య. ఓ స్వామీ! రావయ్యా! కరుణించు, వరాలిచ్చే ప్రభూ! కాపాడు, పుణ్యాత్ముడా

74

విను దఁట జీవుల మాటలు
చను దఁట చనరానిచోట్ల శరణార్థుల కో
యను దఁట పిలిచిన సర్వముఁ
గను దఁట సందేహ మయ్యెఁ గరుణావార్ధీ!

టీక:- వినుదువు = వింటావు; అట = అట; జీవుల = ప్రాణుల; మాటలు = పిలుపులు; చనుదువు = వెళ్ళెదవు; అట = అట; చనరాని = వెళ్ళ సాధ్యముకాని; చోట్లన్ = ప్రదేశముల కైనను; శరణార్థుల్ = ఆర్తనాదము చేసెడివారి; కున్ = కి; ఓయనుదువు = మారుపలుకెదవు; అట = అట; పిలిచినన్ = పిలిచినట్టి; సర్వమున్ = సర్వులను సర్వావస్థలను; కనుదువు = చూచెదవు; అట = అట; సందేహమున్ = అనుమానము; అయ్యెన్ = కలుగుచున్నది; కరుణావార్ధీ = దయాసముద్రుడా.

భావము:- ఓ దయాసాగరా! నీవు సర్వ ప్రాణుల పిలుపులు వింటావట. వారిపై దయ చూపడానికి పోరాని చోట్లకు ఐనా పోతావట. శరణన్న వారికి వెంటనే ఓయ్ అని అంటావుట. కాని ఇప్పుడు ఇదంతా సత్యమేనా అని అనుమానంగా ఉంది.

75

ఓ కమలాప్త! యో వరద! యో ప్రతిపక్షవిపక్షదూర! కు
య్యో! కవియోగివంద్య! సుగుణోత్తమ! యో శరణాగతామరా
నోకహ! యో మునీశ్వర మనోహర! యో విమలప్రభావ! రా
వే! కరుణింపవే! తలఁపవే! శరణార్థిని నన్ను గావవే!"

టీక:- ఓ = ఓ; కమలాప్త = నారాయణ {కమలాప్తుడు - కమల (లక్ష్మీదేవికి) ఆప్తుడైనవాడ, విష్ణువు}; ఓ = ఓ; వరద = నారాయణ {వరదుడు - వరములను ఇచ్చువాడు, విష్ణువు}; ఓ = ఓ; ప్రతిపక్షవిపక్షదూర = నారాయణ {ప్రతిపక్షవిపక్షదూరుడు - ప్రతిపక్ష (శత్రుపక్షము) యందును విపక్ష (వైరము) విదూర (లేనివాడు), విష్ణువు}; కుయ్యో = ఓ; కవియోగివంద్య = నారాయణ {కవియోగివంద్యుడు - కవులచేతను యోగులచేతను వంద్యుడు (కీర్తింపబడువాడు), విష్ణువు}; సుగుణోత్తమ = నారాయణ {సుగుణోత్తముడు - సుగుణములు గల ఉత్తముడు, విష్ణువు}; ఓ = ఓ; శరణాగతామరానోకహ = నారాయణ {శరణాగతామరానోకహ - శరణాగత (శరణువేడినవారికి) అమర (దేవ, కల్ప) అనోకహ (వృక్షమువంటివాడు), విష్ణువు}; ఓ = ఓ; మునీశ్వరమనోహర = నారాయణ {మునీశ్వరమనోహరుడు - మునీశ్వరుల మనసులను హర (దొంగిలించినవాడు), విష్ణువు}; ఓ = ఓ; విమలప్రభావ = నారాయణ {విమలప్రభావుడు - విమల (స్వచ్ఛమైన) ప్రభావుడు (మహిమ గలవాడు), విష్ణువు}; రావే = రమ్ము; కరుణింపవే = దయచూపుము; తలపవే = భావించుము; శరణార్థిని = శరణుకోరెడివాడను; నన్నున్ = నన్ను; కావవే = కాపాడుము.

భావము:- ఓ కమలాక్షుడా! ఓ వరాలు ఇచ్చే ప్రభూ! శత్రువులపై కూడ వైరం లేనివాడా! పండితులచే నమస్కారాలు అందుకొనే వాడా! ఉత్తమ సుగుణాలు కలవాడా! శరణు కోరు వారికి కల్పవృక్షం వంటివాడా! మునీంద్రులకు ప్రియమైనవాడా! నిర్మలమైన మహిమ కల వాడా! నా మొర విను. వెంటనే రా. కనికరించు. కరుణించి శరణు వేడుతున్న నన్ను కాపాడు.

76

అని పలికి మఱియు "నరక్షిత రక్షకుండైన యీశ్వరుం డాపన్నుఁడైన నన్నుఁ గాచుఁ గాక" యని నింగి నిక్కి చూచుచు, నిట్టూర్పులు నిగిడించుచు, బయ లాలకించుచు నగ్గజేంద్రుండు మొఱచేయుచున్న సమయంబున.

టీక:- అని = అని; పలికి = మొరపెట్టుకొని; మఱియున్ = ఇంకను; అరక్షిత = దిక్కులేనివారిని; రక్షకుండు = కాపాడెడివాడు; ఐన = అయిన; ఈశ్వరుండు = పరమేశ్వరుడు; ఆపన్నుడు = ఆపదలో నున్నవాడు; ఐన = అయిన; నన్నున్ = నన్ను; కాచుగాక = కాపాడుగాక; అని = అని; నింగిన్ = ఆకాశమువైపు; నిక్కి = సాగి; చూచుచున్

= చూచుచు; నిట్టూర్పులున్ = నిట్టూర్పులను {నిట్టూర్పు - నిడి (దీర్ఘమైన) ఊర్పు (శ్వాస), మనసులోని శ్రమకు సంకేతము}; నిగడించుచు = విడుచుచు; బయలాలకించుచు = నిశ్చేష్టమగుచు {బయలాలకించు - బయలు (శూన్యములోనికి) ఆలకించు (విను), నిశ్చేష్టమగు}; ఆ = ఆ; గజేంద్రుండు = గజేంద్రుడు; మొఱచేయుచున్న = ఆక్రోశించుచున్న; సమయంబుననన్ = సమయములో.

<u>భావము</u>:- ఇలా ప్రార్థించి "రక్షణ లేనివారిని రక్షించే ఆ భగవంతుడు నన్ను కాపాడుగాక!" అని గజరాజు మొరపెట్టుకొన్నాడు. ఆకాశం వైపు నిక్క నిట్టూర్చాడు. ఆకాశానికి చెవులు అప్పజెప్పి ఆక్రోశించాడు. ఆ సమయంలో.

## విష్ణువు ఆగమనము

77

<u>వి</u>శ్వమయత లేమి <u>వి</u>నియు నూరక యుండి
<u>రం</u>బుజాసనాదు <u>లె</u>డ్డపడక
<u>వి</u>శ్వమయుఁడు, విభుఁడు, <u>వి</u>ష్ణుండు, జిష్ణుండు
<u>భ</u>క్తియుతున కడ్డ<u>ప</u>డఁ దలంచె.

<u>టీక</u>:- విశ్వ = జగత్తు యంతయును; మయత = నిండి యుండుట; లేమిన్ = లేకపోవుటచేత; వినియున్ = విన్నప్పటికిని; ఊరక = స్పందించకుండగ; ఉండిరి = ఉన్నారు; అంబజాసన = బ్రహ్మదేవుడు; ఆదులు = మున్నగువారు; అడ్డపడక = సాయపడకుండ; విశ్వమయుడు = నారాయణుడు {విశ్వమయుడు - జగత్తంతను నిండి యున్నవాడు, హరి}; విభుడు = నారాయణుడు {విభుడు – వైభవము గలవాడు, హరి}; విష్ణుండు = నారాయణుడు {విష్ణువు – విశ్వమున వ్యాపించినవాడు, హరి}; జిష్ణుండు = నారాయణుడు {జిష్ణుడు - జయించు శీలము గలవాడు, హరి}; భక్తియుతున్ = భక్తి గలవాని; కిన్ = కి; అడ్డపడ = సాయపడవలెనని; తలచె = భావించెను.

<u>భావము</u>:- ఆ సమయంలో బ్రహ్మదేవుడు మొదలగు వారికి విశ్వమంతా నిండి ఉండే గుణం లేకపోవుటచేత గజరాజు మొర వినబడినా వారు అడ్డుపడకుండ ఊరికే ఉండిపోయారు. విశ్వమంతా వ్యాపించే వాడు, ప్రభువు, విజయశీలి ఐన విష్ణువు భక్తు డైన గజరాజును రక్షించాలని నిశ్చయించుకొన్నాడు.

78

అల వైకుంఠపురంబులో నగరిలో నా మూల సౌధంబు దా
పల మందారవనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోపలో
త్పల పర్యంక రమావినోది యగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము "పాహిపాహి" యనఁ గుయ్యాలించి సంరంభియై.

టీక:- అల = అక్కడ; వైకుంఠ = వైకుంఠ మనెడి; పురంబు = పట్టణము; లోన్ = అందు; నగరి = రాజ భవన సముదాయము; లోన్ = అందు; ఆ = ఆ; మూల = ప్రధాన; సౌధంబు = మేడ {సౌధము - సుధ (సున్నముతో) చేయబడినది, మేడ}; దాపల = దగ్గర; మందార = మందార పూల; వన = తోట; అంతర = లోపల; అమృత = అమృత జలపు; సరస్ = సరోవరము; ప్రాంత = సమీపమున గల; ఇందుకాంత = చంద్రకాంత; ఉపల = శిల (పైన); ఉత్పల = కలువల; పర్యంక = పాన్పుపై నున్న; రమా = లక్ష్మీదేవితో; వినోది = వినోదించు చున్న వాడు; అగున్ = అయిన; ఆపన్న = కష్టాలలో నున్న వారిని; ప్రసన్నుండు = అనుగ్రహించు వాడు; విహ్వల = విహ్వలము చెంది నట్టి {విహ్వలము - భయాదులచేత అవయవముల స్వాధీనము తప్పుట}; నాగేంద్రము = గజేంద్రుడు; పాహి పాహి = కాపాడు కాపాడు; అనన్ = అను; కుయ్యాలించి = మొర ఆలించి; సంరంభి = వేగిరపడు తున్న వాడు; ఐ = అయ్యి.

భావము:- ఆపదలలో చిక్కుకున్న వారిని కాపాడే ఆ భగవంతుడు ఆ సమయంలో వైకుంఠంలో ఉన్నాడు. అక్కడ అంతఃపురంలో ఒక పక్కన ఉండే మేడకు సమీపంలో ఒక అమృత సరస్సుంది. దానికి దగ్గరలో చంద్రకాంతశిలల అరుగుమీద కలువపూల పాన్పుపై లక్ష్మీదేవితో వినోదిస్తున్నాడు. అప్పుడు భయంతో స్వాధీనం తప్పిన గజేంద్రుడు కాపాడమని పెట్టే మొర విన్నాడు. గజరాజుని కాపాడడానికి వేగిరపడ్డాడు.

79

సిరికిం జెప్పఁడు; శంఖ చక్ర యుగముం జేదోయి సంధింపఁ; డే
పరివారంబును జీరఁ; డభ్రగపతిం బన్నింపఁ; డాకర్ణికాం
తర ధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు; వివాదప్రోత్థితశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై.

టీక:- సిరి = లక్ష్మీదేవి; కిన్ = కైనను; చెప్పడు = చెప్పుట లేదు; శంఖ = శంఖము; చక్ర = సుదర్శన చక్రము; యుగమున్ = జంటను; చేదోయి = చేతులు రెంటి యందు;

సంధింపడు = ధరించుటలేదు; ఏ = ఏ; పరివారంబునున్ = సేవకులను; చీరడు = పిలువడు; అభ్రగపతిన్ = గరుత్మంతుని {అభ్రగపతి - అభ్రగము (గగనచరు లైన పక్షులకు) పతి (ప్రభువు), గరుడుడు}; పన్నింపడు = సిద్ధపరుప నియమించడు; ఆకర్ణిక = చెవిదుద్దుల; అంతర = వరకు జారినట్టి; ధమ్మిల్లమున్ = జుట్టుముడిని; చక్కనొత్తడు = చక్కదిద్దుకొనుట లేదు; వివాద = ప్రణయకలహము నందు; ప్రోత్థిత = పైకిలేచుచున్న; శ్రీ = లక్ష్మీదేవి యొక్క; కుచ = వక్షము; ఉపరి = మీది; చేలాంచలము = చీరకొంగు; ఐనన్ = అయినను; వీడడు = వదలిపెట్టుట లేదు; గజ = గజేంద్రుని; ప్రాణ = ప్రాణములను; అవన = కాపాడెడి; ఉత్సాహి = ఉత్సాహము కలవాడు; ఐ = అయ్యి.

<u>భావము</u>:- గజేంద్రుడి ప్రాణాలు కాపాడాలనే వేగిరపాటుతో విష్ణువు లక్ష్మీదేవికి చెప్పలేదు. శంఖచక్రాలను చేతులలో ధరించలేదు. సేవకులను ఎవరిని పిలవలేదు. వాహనం ఐన గరుత్మంతుని పిలవలేదు. చెవికుండలాల వరకు జారిన జుట్టుముడి కూడ చక్కదిద్దుకోలేదు. ఆఖరికి ప్రణయ కలహంలో పట్టిన లక్ష్మీదేవి పైటకొంగు కూడ వదలి పెట్టలేదు.

80

ఇట్లు భక్తజనపాలన పరాయణుండును, నిఖిల జంతు హృదయారవింద సదన సంస్థితుండును నగు నారాయణుండు కరికులేంద్ర విజ్ఞాపిత నానావిధ దీనాలాపంబు లాకర్ణించి, లక్ష్మీకాంతా వినోదంబులం దగులు సాలించి, సంభ్రమించి దిశలు నిరీక్షించి, గజేంద్రరక్షాపరత్వంబు నంగీకరించి, నిజపరికరంబు మరల నవధరించి గగనంబున కుద్గమించి వేంచేయు నప్పుడు.

<u>టీక</u>:- ఇట్లు = ఈ విధముగ; భక్త = భక్తులైన; జన = వారి; పాలన = రక్షించుట యందు; పరాయణుండును = ఏకాగ్రమైన ఆసక్తి గలవాడు; నిఖిల = సర్వ; జంతు = జీవుల; హృదయ = హృదయము లనెడి; అరవింద = పద్మముల యందు; సంస్థితుండును = వసించువాడు; అగు = ఐన; నారాయణుండు = విష్ణుమూర్తి {నారాయణుండు - ఉదకము స్థానముగా గల వాడు, హరి}; కరికులేంద్ర = గజేంద్రుని {కరికులేంద్రుడు - కరి (ఏనుగు) కుల (సమూహమునకు) ఇంద్రుడు (ప్రభువు), గజేంద్రుడు}; విజ్ఞాపిత = మొరపెట్టుకొన్న; నానవిధ = వివిధములైన; దీన = ఆర్తి గల; ఆలాపంబులు = ప్రార్థనలు; ఆకర్ణించి = విని; లక్ష్మీకాంత = లక్ష్మీదేవితో; వినోదంబులన్ = సరససల్లాపము లందు; తగులు = ఆసక్తి;

చాలించి = ఆపివేసి; సంభ్రమించి = త్వరపడి; దిశలు = దిక్కులవైపు; నిరీక్షించి = దీర్ఘముగ చూచి; గజేంద్ర = గజేంద్రుని; రక్షా = రక్షించెడి; పరత్వంబున్ = కార్యలగ్నమును; అంగీకరించి = స్వీకరించి; నిజ = తన; పరికరంబున్ = ఆయుధములను; మరల = మళ్ళీ; అవధరించి = పూని; గగనంబునన్ = ఆకాశమున; కున్ = కు; ఉద్గమించి = బయలుదేరి; వేంచేయున్ = వెళ్ళు; అప్పుడు = సమయము నందు.

భావము:- హరి భక్తులను ప్రోచుట యందు అనురక్తి గలవాడు. సర్వ ప్రాణుల హృదయాలనే పద్మాలలో నివసించేవాడు. ఆయన గజేంద్రుని మొరలన్నీ విన్నాడు. లక్ష్మీదేవితో సరస సల్లాపాలు చాలించాడు. ఆత్రుత చెంది అటునిటు చూసి గజేంద్రుని కాపాడుట అనే బరువైన బాధ్యత తీసుకొని అటుపిమ్మట ఆయుధాలను అవధరించి ఆకాశమార్గాన బయలుదేరాడు. ఆ సమయంలో.

81

తనవెంటన్ సిరి; లచ్చివెంట నవరోధవ్రాతమున్; దాని వె
న్కనుఁ బక్షీంద్రుఁడు; వాని పొంతను ధనుఃకౌమోదకీ, శంఖ, చ
క్రనికాయంబును; నారదుండు; ధ్వజినీకాంతుండు రా వచ్చి రో
య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాలగోపాలమున్.

విష్ణుమూర్తి పరికరాదులు

టీక:- తన = అతని; వెంటన్ = వెనుక; సిరి = లక్ష్మీదేవి; లచ్చి = లక్ష్మీదేని; వెంటన్ = వెనుక; అవరోధ = అంతఃపుర స్త్రీ; వ్రాతమున్ = సమూహమును; దాని = వాని; వెన్కనున్ = వెనుక; పక్షీంద్రుడు = గరుత్మంతుడు {పక్షీంద్రుడు - పక్షులకు ఇంద్రుడు (ప్రభువు), గరుడుడు}; వాని = అతని; పొంతను = పక్కనే; ధనుస్ = విల్లు {విష్ణుమూర్తి - (అ)ఆయుధములు 1ధనుస్సు శాఙ్గము 2గద కౌమోదకి 3శంఖము పాంచజన్యము 4చక్రము సుదర్శనము 5కత్తి నందకము (ఆ)రథము శతానందము (ఇ)సేనానాయకుడు విష్వక్సేనుడు}; కౌమోదకీ = కౌమోదకి యనెడి గద; శంఖ = శంఖము; చక్ర = చక్రముల; నికాయంబునున్ = సమూహము; నారదుండు = నారదుడు; ధ్వజినీకాంతుండు = విష్వక్సేనుడు {ధ్వజినీకాంతుండు - (విష్ణుమూర్తి యొక్క) ధ్వజినీ (సేనా) కాంతుడు (నాయకుడు), విష్వక్సేనుడు}; రాన్ = రాగా; వచ్చిరి = వచ్చితిరి; ఒయ్యన =

శ్రీఘ్రముగ; వైకుంఠ = వైకుంఠ మనెడి; పురంబునన్ = పట్టణము నందు; కలుగు = ఉండెడి; వారు = వారు; ఆబాలగోపాలమున్ = సర్వులును.

భావము:- అలా విష్ణుమూర్తి గజేంద్రుని రక్షించటం కోసం లక్ష్మీదేవి కొంగు వదలను కూడ వదలకుండా తటాలున బయలుదేరటంతో

విష్ణువు వెనుక లక్ష్మీ దేవి, ఆమె వెనకాతల అంతఃపుర స్త్రీలు, వారి వెనుక గరుడుడు, ఆయన పక్కనే విల్లూ గదా శంఖచక్రాలు నారదుడు విష్వక్సేనుడు వస్తున్నారు. వారి వెనువెంట వరసగా వైకుంఠపురంలో ఉన్న వాళ్ళందరు కూడా వస్తున్నారు.

ఇది పోతనగారు ప్రసాదించిన పరమాద్భుత అమృత గుళికలలో ఒకటి. పండిత పామరుల నోళ్ళలో తరచుగా నానుతుండే పద్యం. నడకలో భావంలో ఉత్తమ స్థాయి అందుకున్నది. చదువుతుంటేనే వేగంగా పయనమౌతున్న విష్ణుమూర్తి వెనుక అంత వేగంగాను వెళ్తున్న లక్ష్మీదేవి సూదిమొనగా గల బాణంములుకు లాగ అనుసరిస్తున్న పరివారం మనోనేత్రానికి దర్శనమిస్తుంది. *{విష్ణుమూర్తి - (అ) ఆయుధములు 1ధనుస్సు శాఙ్గము 2గద కౌమోదకి 3శంఖము పాంచజన్యము 4చక్రము సుదర్శనము 5కత్తి నందకము (ఆ) రథము శతానందము (ఇ) సేనానాయకుడు విష్వక్సేనుడు (ఈ) వాహనం గరుత్మంతుడు}

82

తదనంతరంబ, ముఖారవింద మకరందబిందు సందోహ పరిష్యందమానానం దేందిందిర యగు న య్యిందిరాదేవి గోవింద కరారవింద సమాకృష్యమాణ సంవ్యానచేలాంచల యై పోవుచు.

టీక:- తదనంతరంబ = తరువాత; ముఖ = ముఖము యనెడి; అరవింద = పద్మము యందలి; మకరంద = పూతేనె; బిందు = చుక్కల; సందోహ = సమూహము; పరిష్యందమాన = స్రవించుచుండగ; ఆనంద = ఆనందిస్తున్న; ఇందిందిర = తుమ్మెదలు గలది; అగున్ = అయినట్టి; ఆ = ఆ; ఇందిరాదేవి = లక్ష్మీదేవి యొక్క; గోవింద = నారాయణుని {గోవిందుడు - భూమి గోవుల స్వర్గము వేదములను పొందెడివాడు, హరి}; కరా = చేయి యనెడి; అరవింద = పద్మముచే; సమాకృష్యమాణ = లాగబడుతున్న; సంవ్యాన = వస్త్రపు, ఉత్తరీయపు; చేలాంచల = కొస (కొంగు) గలవాడు; ఐ = అయ్యి; పోవుచున్ = వెళ్తూ.

భావము:- అప్పుడు పద్మం వంటి లక్ష్మీదేవి ముఖంలో చిందుతున్న మకరందం బిందువులు వంటి తియ్యటి చెమట బొట్లకు తుమ్మెదలు ఆనందంతో ముసిరాయి. విష్ణుమూర్తి తన పైట కొంగు పట్టుకొని లాక్కుపోతుంటే వైకుంఠుని వెన్నంటి పోతూ ఇలా అనుకుంది.

83

తన వేంచేయు పదంబుఁ బేర్కొనఁ; డనాథస్త్రీ జనాలాపముల్
వినెనో? మ్రుచ్చులు మ్రుచ్చలించిరొ ఖలుల్ వేదప్రపంచంబులన్?
దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో? భక్తులం
గని చక్రాయుధుఁ డేఁడి చూపుఁ డని ధిక్కారించిరో? దుర్జనుల్.

టీక:- తన = తను; వేంచేయు = వెళ్ళుతున్న; పదంబున్ = చోటును; పేర్కొనడు = చెప్పుట లేదు; అనాథ = దిక్కులేని; స్త్రీ = మహిళ లైన; జన = వారి; ఆలాపముల్ = మొరలను; వినెనో = విన్నాడేమో; మ్రుచ్చులు = దొంగలు; మ్రుచ్చలించిరో = దొంగతనము చేసిరేమో; ఖలుల్ = నీచులు; వేద = వేదములు; ప్రపంచంబులన్ = సమస్తమును; దనుజ = రాక్షస; అనీకము = మూకలు; దేవతానగరి = అమరావతి {దేవతానగరి - దేవతల రాజధాని, అమరావతి}; పైన్ = మీదికి; దండెత్తెనో = యుద్ధమునకు వెళ్లారేమో; భక్తులన్ = భక్తులను; కని = చూసి; చక్రాయుధుడు = విష్ణుమూర్తి {చక్రాయుధుడు - చక్రము ఆయుధముగా గల వాడు, విష్ణువు}; ఏడీ = ఎక్కడ ఉన్నాడు; చూపుడు = చూపించండి; అని = అని; ధిక్కారించిరో = దబాయించిరేమో; దుర్జనులు = దుష్టులు.

భావము:- "ఎందుచేతనో విభుడు తాను వెళ్ళే చోటు చెప్పటం లేదు. దిక్కులేని స్త్రీల దీనాలాపాలు విన్నాడో ఏమో? దుర్మార్గులు ఐన దొంగలు ఎవరైనా వేదాలను దొంగిలిచారేమో? దేవతల రాజధాని అమరావతిపై రాక్షసులు దాడి చేసారేమో? విష్ణువు ఎక్కడ ఉన్నాడో చెప్పండి అంటు దుర్మార్గులు భక్తులను బెదిరిస్తున్నారో ఏమో?" అని అనేక విధాలుగా లక్ష్మి సందేహపడసాగింది.

84

అని వితర్కించుచు.

టీక:- అని = అని; వితర్కించుచు = మిక్కిలి విచారిస్తూ.

భావము:- అని అనేక విధాలుగా లక్ష్మి సందేహపడసాగింది.

85

తాటంకాచలనంబులతో, భుజనటద్ధమ్మిల్లబంధంబుతో,
శాటీముక్త కుచంబుతో, నదృఢచంచత్కాంచితో, శీర్ణలా
లాటాలేపముతో, మనోహరకరాలగ్నోత్తరీయంబుతోఁ,
గోటీందుప్రభతో, నురోజభర సంకోచద్విలగ్నంబుతోన్.

టీక:- తాటంకా = కర్ణాభరణముల; ఆచలనంబు = అధికమైన కదలికల; తోన్ = తోటి; భుజ = భుజములపై; నటత్ = నాట్య మాడుతున్న; ధమ్మిల్లబంధంబు = జుట్టుముడి; తోన్ = తోటి; శాటీ = పమిటనుండి; ముక్త = విడివడిన; కుచంబు = స్తనముల; తోన్ = తోటి; అదృఢ = బిగుతు తగ్గి; చంచత్ = చలించుచున్న; కాంచి = ఒడ్డాణము; తోన్ = తోటి; శీర్ణ = నుసిరాలుచున్న; లాలాట = నుదిటి యందలి; లేపము = పూత; తోన్ = తోటి; మనోహర = భర్త {మనోహరుడు - మనః (మనసును) హరుడు (దొంగిలించినవాడు), భర్త}; కరా = చేతి యందు; ఆలగ్న = చిక్కుకున్న; ఉత్తరీయంబు = పమిట; తోన్ = తోటి; కోటి = కోటిమంది; ఇందు = చంద్రుల; ప్రభ = కాంతి; తోన్ = తోటి; ఉరోజ = స్తనముల యొక్క; భర = బరువువలన; సంకోచత్ = చిక్కిపోయిన; విలగ్నంబు = నడుము; తోన్ = తోటి;

భావము:- గజేంద్రుని కాపాడాలని పరుగు పరుగున వెళ్తున్న భర్త వెంట కోటి చంద్రుల కాంతి నిండిన ముఖంతో లక్ష్మీదేవి వెళుతోంది. అప్పుడు ఆమె చెవి లోలకులు కదుల్తున్నాయి. భుజాల మీద వీడిన కొప్పుముడి చిందు లేస్తోంది. స్తనాలపై పైటకొంగు తొలగిపోయింది. ఒడ్డాణం వదులై పోయింది. నుదిటి మీద రాసుకొన్న లేపనం చెదిరిపోయింది. మోము కోటి చంద్రుల కాంతితో నిండిపోయింది. స్తనాల భారంతో నడుం చిక్కిపోయింది. ఆమె పైట కొంగు ప్రియభర్త చేతిలో చిక్కుకొనే ఉంది.

86

అడిగెద నని కడువడిఁ జను;
నడిగినఁ దను మగుడ నుడుగఁ డని నడ యుడుగున్;
వెడవెడ సిడిముడి తడఁబడ
నడు గిడు; నడుగిడదు జడిమ నడు గిడునెడలన్.

టీక:- అడిగెదన్ = అడిగెదను; అని = అని; కడు = మిక్కిలి; వడిన్ = వేగముగ; చనున్ = వెళ్ళును; అడిగినన్ = అడిగినప్పటికిని; తను = అతను; మగుడ = మారుపలుకులు; నుడుగడు = పలుకడు; అని = అని; నడన్ = నడచుట; ఉడుగును = విరమించును; వెడవెడ = తొట్రుపడుతూ; సిడిముడిని = చికాకులతో; తడబడన్ = తడబడుతూ; అడుగు = అడుగు; ఇడున్ = వేయును; అడుగున్ = అడుగు; ఇడదు = వేయదు; జడిమన్ = జడత్వములతో; అడుగున్ = అడుగులను; ఇడు = వేసెడి; ఎడలన్ = సమయములలో.

భావము:- అప్పుడు లక్ష్మీదేవి భర్తను అడుగుదా మని వేగంగా అడుగులు వేసేది. అడిగితే మారు పలుకడేమో అని అడుగుల వేగం తగ్గించేది. చికాకులతో తొట్రుపాటుతో అడుగులు వేసేది. మళ్ళీ ఆగేది. అడుగులు కదిలించలేక తడబాటులో నడిచేది.

కరిని కాపాడలని కంగారుగా వెళ్తూ విష్ణుమూర్తి లక్ష్మీదేవి కొంగు వదల లేదు. దానితో భర్త వెనుకనే వెళ్తున్న లక్ష్మీదేవి –

ఈ పద్యం చూస్తున్నామా వింటున్నామా చదువుతున్నామా అనిపిస్తుంది. సందర్భానికి తగిన పలుకుల నడకలు. భావాన్ని స్ఫురింపజేసే పద ధ్వని. ఇంకా ఆపైన సందర్భశుద్ధికేమో బహు అరుదైన సర్వలఘు కంద పద్యం ప్రయోగం. ఆహా ఏమి పద్యం కాదు అమృత గుళిక.

87

నిటలాలకము లంట నివుర జుంజుమ్మని;
ముఖసరోజము నిండ ముసురుఁ దేంట్లు;
నళులఁ జోపఁగఁ జిల్క లల్ల నల్లన చేరి;
యోష్ఠబింబద్యుతు లొడియ నుఱుకు;
శుకములఁ దోలఁ జక్షుర్మీనములకు మం;
దాకినీ పాఠీనలోక మెసఁగు;
మీన పంక్తుల దాఁట మెయిదీఁగతో రాయ;
శంపాలతలు మింట సరణిఁ గట్టు;
శంపలను జయింపఁ జక్రవాకంబులు
కుచయుగంబుఁ దాఁకి క్రొవ్వుఁజూపు;
మెలఁత మొగిలు పిఱిఁది మెఱుఁగుఁదీవయుఁ బోలె

జలదవర్ణు వెనుకఁ జనెడునపుడు.

టీక:- నిటల = నుదుట; అలకులు = ముంగురులు; అంటన్ = అంటుకొనగ; నివురన్ = చక్కదిద్దబోతే; జుంజుమ్మ్ = జుంజుం; అని = అనెడి ఝుంకారములతో; ముఖ = ముఖము యనెడి; సరోజము = పద్మము; నిండ = అంతటను; ముసురున్ = కప్పును; తేంట్లు = తుమ్మెదలు; అళులన్ = తుమ్మెదలను; జోపగన్ = తోలగా; చిల్కలు = చిలుకలు; అల్లనల్లన = మెల్లగా; చేరి = సమీపించి; ఓష్ఠ = పెదవి యనెడి; బింబ = దొండపండు; ద్యుతులు = కాంతులను; ఒడియన్ = ఒడిసిపట్టుకొన; ఉఱుకున్ = దూకును; శుకములన్ = చిలుకలను; తోలన్ = తోలగా; చక్షుః = కన్నులు యనెడి; మీనముల్ = చేపల; కున్ = కు; మందాకినీ = ఆకాశగంగలోని; పాఠీన = చేపల; లోకమున్ = సమూహము; ఎసగు = విజృంభించును; మీన = చేపల; పంక్తులన్ = సమూహములను; దాటన్ = దాటగా; మొయి = దేహము యనెడి; తీగ = తీవ; తోన్ = తోటి; రాయన్ = రాసుకుపోవుటకు; శంపా = మెఱుపు; లతలున్ = తీగలు; మింటన్ = ఆకాశములో; సరణి = వరుసలు; కట్టున్ = కట్టును.

శంపలను = మెఱుపులను; జయింపన్ = జయించుటకు; చక్రవాకంబులున్ = చక్రవాకపక్షులు; కుచ = స్తనముల; యుగంబున్ = జంటను; తాకి = ఎదుర్కొని; క్రొవ్వు = బలమును; చూపున్ = చూపుతున్నవి; మెలత = స్త్రీ; మొగిలు = మేఘము; పిఱిది = వెనుకనుండు; మెఱుగు = మెరుపు; తీవయున్ = తీగను; పోలెన్ = వలె; జలదవర్ణున్ = మేఘము వంటి రంగు వాని; వెనుకన్ = వెంట; చనెడు = వెళ్ళెడి; అపుడు = సమయము నందు.

భావము:- మేఘం వెంట మెరుపు తీగ వలె లక్ష్మీదేవి విష్ణుమూర్తి వెంట వెళ్ళసాగింది. ఆ సమయంలో ఆమె నుదుటి మీది ముంగురులను చక్కదిద్దుకోబోతే, పద్మంలాంటి ఆమె మోము నిండా తుమ్మెదలు ముసురుకున్నాయి. వాటిని తోలుతుంటే, ఆమె పెదవులను చూసి దొండపం డనుకొని చిలుకలు వచ్చి చేరాయి. చిలకలని తోలుతుంటే, చేపల లాంటి ఆమె కన్నులను చూసి ఆకాశగంగ లోని పెనుచేపలు ఎగసి పడ్డాయి. చేపలను తప్పించుకోగానే ఆమె శరీరపు మెరుపు చూసి ఆ దేహలతని ఒరుసుకోడానికి మెరుపు తీగలు బారులు తీరాయి. మెరుపు తీగలను దాటగానే, చక్రవాకపక్షుల జంటలు మిడిసి పాటుతో గుండ్రటి ఆమె స్తనద్వయాన్ని తాకాయి.

వినువీథిన్ జనుదేరఁ గాంచి రమరుల్ విష్ణున్, సురారాతి జీ
వనసంపత్తి నిరాకరిష్ణుఁ, గరుణావర్ధిష్ణుఁ, యోగీంద్ర హృ
ద్వనవర్తిష్ణు, సహిష్ణు, భక్తజనబృందప్రాభవాలంకరి
ష్ణు, నవోఢోల్ల సదిందిరా పరిచరిష్ణున్, జిష్ణు, రోచిష్ణునిన్.
టీక:- వినువీథిన్ = ఆకాశమార్గము నందు; చనుదేరన్ = వెళ్ళుతుండగా; కాంచిరి = దర్శించిరి; అమరుల్ = దేవతలు; విష్ణున్ = హరిని {విష్ణువు - విశ్వమున వ్యాపించి యుండువాడు, నారాయణుడు}; సురారాతిజీవనసంపత్తినిరాకరిష్ణున్ = హరిని {సురారాతిజీవనసంపత్తినిరాకరిష్ణుడు - సుర (దేవతల) ఆరాతి (శత్రువుల యొక్క) జీవనసంపత్తి (బ్రతుకుదెరువు)ను నిరాకరిష్ణుడు (నిరాకరించెడివాడు), విష్ణువు}; కరుణావర్ధిష్ణున్ = హరిని {కరుణావర్ధిష్ణుడు - కారుణ్యము వృద్ధి యగు స్వభావము గల వాడు, విష్ణువు}; యోగీంద్రహృద్వనవర్తిష్ణున్ = హరిని {యోగీంద్రహృద్వనవర్తిష్ణుడు - యోగీంద్రుల హృదయము లనెడి వన (తోటలలో) వర్తిష్ణుడు (మెలగెడువాడు), విష్ణువు}; సహిష్ణున్ = హరిని {సహిష్ణుడు - సహన స్వభావము గల వాడు, విష్ణువు}; భక్తజనబృందప్రాభవాలంకరిష్ణున్ = హరిని {భక్తజనబృందప్రాభవాలంకరిష్ణుడు - భక్తజనుల బృంద (సమూహములను) ప్రాభవ (గొప్పదనము)తో అలంకరిష్ణుడు (అలంకరించెడి వాడు), విష్ణువు}; నవోఢోల్లసదిందిరాపరిచరిష్ణున్ = హరిని {నవోఢోల్లసదిందిరాపరిచరిష్ణుడు - నవోఢ (కొత్తపెళ్ళికూతురు) వలె ఉల్లసత్ (ఉల్లాసము గల) ఇందిరా (లక్ష్మీదేవికి) పరిచరిష్ణుడు (పరిచారునిగా ఉండు వాడు. కలిసి విహరించు వాడు), విష్ణువు}; జిష్ణున్ = హరిని {జిష్ణువు - జయించు స్వభావముగల వాడు, విష్ణువు}; రోచిష్ణునిన్ = హరిని {రోచిష్ణుడు - ప్రకాశించెడి స్వభావము గల వాడు, విష్ణువు}.
భావము:- విష్ణుమూర్తి రాక్షసుల బతుకు తెరువులను నశింప జేసే వాడు, దయా రసంతో మించేవాడు, మహాయోగుల హృదయా లనే వనాలలో విహరించేవాడు, గొప్ప ఓర్పుగల వాడు, భక్తుల గొప్పదనాన్ని పెంపొందించేవాడు, నవయౌవనంతో వెలుగొందే లక్ష్మీదేవితో కలిసి విహరించే వాడు. జయశీలుడు, మహా కాంతిమంతుడు. అట్టి భగవంతుడిని ఆకాశమార్గంలో వస్తుండగా దేవతలు చూసారు.

89

ఇట్లు పొడగని.

<u>టీక</u>:- ఇట్లు = ఈ విధముగ; పొడగని = దర్శించి.

<u>భావము</u>:- అలా గజేంద్రుని కాపాడటానికి వెళుతున్న విష్ణుమూర్తిని దేవతలు కనుగొని

90

"<u>చ</u>నుదెంచెన్ ఘనుఁ డల్లవాఁడె; హరి ప<u>జ్జం</u> గంటిరే లక్ష్మి? శం
<u>ఖ</u> నినాదం బదె; చక్ర మల్లదె; భుజం<u>గ</u>ధ్వంసియున్ వాఁడె; క్ర
<u>న్న</u>న యేతెంచె" నటంచు వేల్పులు "నమో<u>నా</u>రాయణాయేతి" ని
<u>స్స్వ</u>నులై మ్రొక్కిరి మింట హస్తిదురవస్థావక్రికిం జక్రికిన్.

<u>టీక</u>:- చనుదెంచెన్ = వచ్చినాడు; ఘనుడు = గొప్పవాడు; అల్ల = అక్కడి; వాడె = అతడే; హరి = విష్ణువు; పజ్జన్ = పక్కనే; కంటిరే = చూసితిరా; లక్ష్మిన్ = లక్ష్మీదేవిని; శంఖనినాదంబు = పాంచజన్య శంఖధ్వని; అదె = అక్కడ నున్నదే; చక్రము = సుదర్శనచక్రము; అల్లదె = అక్క డున్న దే; భుజంగధ్వంసియున్ = గరుత్మంతుడు; వాడె = అతడే; క్రన్ననన్ = వరుసగా; ఏతెంచెన్ = వచ్చిరి; అట = అని; అంచున్ = అనుచు; వేల్పులు = దేవతలు; నమో = నమస్కారము; నారాయణ = నారాయణునికి; ఇతి = ఇది యనెడి; నిస్వనులు = పలికెడివారు; ఐ = అయ్యి; మ్రొక్కిరి = నమస్కరించిరి; మింటన్ = ఆకాశము నందు; హస్తిదురవస్థావక్రికిన్ = హరికి {హస్తిదురవస్థావక్రి - హస్తి (ఏనుగు యొక్క) దురవస్థ (ఆపదను) వక్రి (మరలించెడివాడు), విష్ణువు}; చక్రికిన్ = హరికి {చక్రి - చక్రము ఆయుధముగా గల వాడు, విష్ణువు}.

<u>భావము</u>:- గజేంద్రుని ఆర్తి బాపటానికి ఆరాటంగా ఆకాశంలో వెళ్తున్న శ్రీమహావిష్ణువును చూసి దేవతలు

“అదిగదిగో మహనీయుడైన విష్ణుమూర్తి వస్తున్నాడు. అతని వెనుకనే శ్రీమహాలక్ష్మి వస్తున్నది చూడండి. అదిగో పాంచజన్య శంఖధ్వని. సర్పాలను సంహరించేవాడు గరుత్మంతుడు అదిగో చూడండి వెంట వస్తున్నాడు.” అనుకుంటు “నారాయణునికి నమస్కారం” అంటు నమస్కారాలు చేస్తున్నారు.

91

అ య్యవసరంబునఁ గుంజరేంద్రపాలన పారవశ్యంబున దేవతానమస్కారంబు లంగీకరింపక మనస్సమాన సంచారుం డై పోయిపోయి, కొంతదూరంబున శింశుమారచక్రంబునుం బోలె గురుమకరకుళీర మీనమిథునంబై; కిన్నరేంద్రుని భాండాగారంబునుంబోలె స్వచ్ఛ మకరకచ్ఛపంబై; భాగ్యవంతుని భాగధేయంబునుంబోలె సరాగ జీవనంబై; వైకుంఠపురంబునుంబోలె శంఖచక్ర కమలాలంకృతంబై; సంసార చక్రంబునుంబోలె ద్వంద్వసంకుల పంక సంకీర్ణంబై యొప్పు నప్పంకజాకరంబుఁ బొడగని.

టీక:- ఆ = ఆ; అవసరంబునన్ = సమయము నందు; కుంజరేంద్ర = గజేంద్రుని; పాలన = పరిపాలించెడి; పారవశ్యంబునన్ = మైమరపుచేత; దేవతా = దేవతల యొక్క; నమస్కారంబులన్ = నమస్కారములను; అంగీకరింపక = స్వీకరింపకుండగ; మనస్సమాన = మనోవేగముతో సమానముగ; సంచారుండు = వెళ్ళువాడు; ఐ = అయ్యి; పోయిపోయి = వెళ్ళివెళ్ళి; కొంత = కొంత; దూరంబునన్ = దూరము నందు; శింశుమారచక్రంబున్ = ఆకాశ మందలి రాసుల చక్రము, మొసళ్ళ నివాసము; పోలెన్ = వలె; గురు = గురుగ్రహము, పెద్దపెద్ద; మకర = మకరరాశి, మొసళ్ళు; కుళీర = కర్కాటకరాశి, పీతలు; మీన = మీనరాశి, చేపలు; మిథునంబు = మిథునరాశి, జంటలు; ఐ = కలది యై; కిన్నరేంద్రుని = కుబేరుని; భాండాగారంబునున్ = ధనాగారము; పోలెన్ = వలె; స్వచ్ఛ = స్వచ్ఛమైన, తెల్లని; మకర = మకర మనెడి నిధి గలది, మొసళ్ళు గలది; కచ్ఛపంబు = కచ్ఛప మనెడి నిధి గలది, తాబేళ్ళు గలది; ఐ = అయ్యి; భాగ్యవంతుని = అదృష్టవంతుని; భాగధేయంబునున్ = సుఖజీవితము; పోలెన్ = వలె; సరాగ = అనురాగంతో కూడిన, ఎఱ్ఱని; జీవనంబున్ = జీవితము గలది, నీరు గలది; ఐ = అయ్యి; వైకుంఠ = వైకుంఠము యనెడి; పురంబునున్ = పురము; పోలెన్ = వలె; శంఖ = పాంచజన్యము, శంఖములు; చక్ర = సుదర్శనము, చక్రవాకములు; కమలా = లక్ష్మీదేవిలతో, కమలములతో; అలంకృతంబు = అలంకరింపబడినది; ఐ = అయ్యి; సంసారచక్రంబునున్ = సంసారసాగరము; పోలెన్ = వలె; ద్వంద్వ = జలచర జంటలుతో, సుఖదుఃఖాది ద్వంద్వములు; సంకుల = కలకబారిన, వ్యాపించిన; సంకీర్ణంబు = చిక్కని బురద గలది, మిక్కలి చిక్కులు గలది; ఐ = అయ్యి; ఒప్పు = ఒప్పెడి; ఆ = ఆ; పంకజాకరంబున్ = మడుగును {పంకజాకరము - పంకజము (పద్మములకు) ఆకరము (నివాసము), సరోవరము}; పొడగని = కనుగొని;

భావము:- ఆ సమయంలో గజేంద్రుడిని రక్షంచాలని వెళ్తున్న తొందరలో, విష్ణుమూర్తి దేవతల మొక్కులు అందుకోలేదు. అలా మనోవేగంతో వెళ్ళి, ఏనుగు మొసలి పోరాడుతున్న మడుగుని చూసాడు. ఆ మడుగులో శింశుమార చక్రంలో లాగ గొప్ప మొసళ్ళు, పీతలు, చేపలు జంటలు జంటలుగా ఉన్నాయి. కుబేరుని ధనాగారంలోని కచ్ఛపం అనే నిధి వంటి శ్రేష్ఠమైన తాబేళ్ళు ఉన్నాయి, ధనవంతుని సుఖజీవనంలోని అనురాగం లాగ ఎళ్ళని జీవనం (నీరు) నిండుగా ఉంది, వైకుంఠం వలె శంఖం, చక్రం (చక్రవాక పక్షులు), కమల (లక్ష్మి) లతో అలంకరింపబడి ఉంది. సుఖ దుఃఖాలనే ద్వంద్వాలతో నిండిన సంసారం వలె జలచరాల జంటలతో కలచబడిన బురద కలిగి యుంది.

## గజేంద్ర రక్షణము

92

క**రు**ణాసింధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగాఁ బంపె స
త్త్వ**రి**తాకంపిత భూమిచక్రము, మహోద్యద్విస్ఫులింగచ్ఛటా
ప**రి**భూతాంబర శుక్రమున్, బహువిధబ్రహ్మాండభాండచ్ఛటాం
త**ర**నిర్వక్రముఁ, బాలితాఖిల సుధాంధశ్చక్రముం, జక్రమున్.

టీక:- కరుణాసింధుడు = దయాసముద్రుడు; శౌరి = విష్ణువు {శౌరి - శూరుని మనవడు, శ్రీకృష్ణుడు, శౌర్యము అంటే శూరత్వము, చండిమ, ఝు, పరాక్రమము, విక్రమము, వీర్యము అని వాచత్పతము కనుక శౌర్యము కలవాడు శూరి అనవచ్చును.}; వారిచరమున్ = మొసలిని {వారిచరము - వారి (నీటి) చరము (జంతువు), మొసలి}; ఖండింపగన్ = సంహరించుటకు; పంపెన్ = పంపించెను; సత్వరితా = మిక్కిలి వేగముచేత; ఆకంపిత = చలింపజేయబడెడి; భూమిచక్రమున్ = భూమండలము గలది; మహా = అధికముగా; ఉద్యత్ = విరజిమ్మబడిన; విస్ఫులింగ = అగ్నికణముల; ఛటా = సమూహములచే; పరిభూత = అవమానపరచబడిన; అంబర = ఆకాశము నందలి; శుక్రమున్ = శుక్రమండలము గలది; బహువిధ = నానావిధమైన; బ్రహ్మాండభాండ = బ్రహ్మాండభాండముల; ఛటాన్ = సమూహముల; అంతర = అందంతటను; నిర్వక్రమున్ = అడ్డులేనిది; పాలిత = కాపాడబడిన; అఖిల = సమస్తమైన; సుధాంధ = దేవతల {సుధాంధువులు - సుధ (అమృతము) అంధువులు (అన్నముగా గలవారు), దేవతలు}; చక్రమున్ = సమూహము గలది; చక్రమున్ = చక్రము.

భావము:- దయాసాగరుడైన నారాయణుడు మొసలిని చంప మని తన చక్రాన్ని పంపాడు. ఆ చక్రం భూమండలాన్ని కంపింప జేసే వేగం కలది. గొప్ప అగ్నికణాల జల్లులతో ఆకాశ మండలాన్ని కప్పివేసేది. అనేక విధమైన బ్రహ్మాండభాండాల సమూహాలలోను ఎదురు లేనిది. దేవతలను అందరిన కాపాడేది.

93

ఇట్లు పంచిన.

టీక:- ఇట్లు = ఈ విధముగ; పంచినన్ = పంపించగా.

భావము:- ఇలా పంపగానే,

94

అంభోజాకరమధ్య నూతన నలిన్యాలింగన క్రీడ నా
రంభుం డైన వెలుంగుఱేని చెలువారన్ వచ్చి, నీటన్ గుభుల్
గుంభద్ధ్వానముతోఁ గొలంకును కలంకం బొందఁగా జొచ్చి, దు
ష్టాంభోవర్తి వసించు చక్కటికి డాయంబోయి హృద్వేగమై.

టీక:- అంభోజాకర = సరస్సు {అంభోజాకరము - అంభోజము (పద్మము)ల ఆకరము (నివాసము), సరోవరము}; మధ్య = మధ్యలో గల; నూతన = సరికొత్త; నళిని = పద్మమును; ఆలింగన = కౌగలించుకొనెడి; క్రీడన్ = ఉత్సాహముతో; ఆరంభుండు = సిద్ధపడుతున్నవాడు; ఐన = అయిన; వెలుంగుఱేని = సూర్యుని; చెలువారన్ = అందచందములతో; వచ్చి = వచ్చి; నీటన్ = నీటిలో; గుభుల్ = గుభుల్ యనెడి శబ్దముతో; గుంభత్ = కూర్చబడిన; ధ్వానము = గట్టిశబ్దము; తోన్ = తోటి; కొలంకున్ = మడుగును; కలంకంబున్ = కల్లోలము; పొందగాన్ = అగునట్లుగా; చొచ్చి = చొరబడి; దుష్ట = చెడ్డదైన; అంభోవర్తి = జలచరము; వసించు = ఉండెడి; చక్కటి = చోటు; కిన్ = కు; డాయంబోయి = చేరి; హృత్ = అధికమైన, మనసువంటి; వేగము = వేగము గలది; ఐ = అయ్యి.

భావము:- ఇలా పంపగానే, చక్రాయుధం సరోవరంలోని లేలేత పద్మాలని కౌగలించుకోడానికి వెళ్తున్న సూర్యబింబంలా వెళ్ళింది. గుభిల్లు గుభిల్లనే పెద్ద చప్పుడుతో మడుగు కలచిపోయేలా లోపలికి దూకింది. రివ్వున మనో వేగంతో ఆ చెడ్డదైన మొసలి ఉన్న చోటు సమీపించింది.

95

భీమంబై తలఁ ద్రుంచి ప్రాణములఁ బాపెం జక్ర మా శుక్రియన్,
హేమక్ష్మాధర దేహముం, జకితవన్యేభేంద్ర సందోహముం,
గ్రామక్రోధన గేహమున్, గరటి రక్తస్రావ గాహంబు, ని
స్సీమోత్సాహము, వీత దాహము, జయశ్రీమోహమున్, గ్రాహమున్.

టీక:- భీమంబు = భయంకరమైనది; ఐ = అయ్యి; తలన్ = శిరస్సును; త్రుంచి = కత్తిరించి; ప్రాణములన్ = ప్రాణములను; పాపెన్ = తీసెను; చక్రమున్ = విష్ణుచక్రము; ఆశు = వేగవంతమైన; క్రియన్ = విధముగ; హేమక్ష్మాధర = మేరుపర్వతము వంటి {హేమక్ష్మాధరము - హేమ (బంగారు) క్ష్మాధరము (కొండ), మేరుపర్వతము}; దేహమున్ = శరీరము గలదానిని; చకిత = భయపెట్టబడిన; వన్య = అడవి; ఇభ = ఏనుగు; ఇంద్ర = శ్రేష్ఠముల; సందోహమున్ = సమూహము గలదానిని; కామ = కామము; క్రోధన = క్రోధములకు; గేహమున్ = నివాసమైన దానిని; కరటి = ఏనుగు యొక్క; రక్త = రక్తపు; స్రావ = ధారల యందు; గాహంబున్ = మునిగినదానిని; నిస్సీమ = అంతులేని; ఉత్సాహమున్ = ఉత్సాహము గలదానిని; వీత = పోయిన; దాహమున్ = ఆయాసము గలదానిని; జయ = విజయ మనెడి; శ్రీ = సంపద యందు; మోహమున్ = మోహము గలదానిని; గ్రాహమున్ = మొసలిని.

భావము:- రివ్వున పోయి, చక్రాయుధం మొసలి తలని భయంకరంగా తెగనరికింది. ఆ మకరం మేరు పర్వతమంత పెద్ద దేహం గలది, అడవి ఏనుగులకు సైతం భయం కలిగించేది, కామక్రోధాలతో నిండినది. గజరాజు రక్తధారల రుచిమరిగినది, అంతులేని ఉత్సాహంతో అలసటలేకుండ పోరాడుచున్నది, గెలుపుని నమ్మకంగా కోరుతున్నది. విష్ణుచక్రం వెళ్ళి అలాంటి మొసలి శిరస్సుని ఖండించి ప్రాణాలు తీసింది.

ఈ అద్భుతమైన పోతన పద్యం ఒక అమృత గుళిక. కామక్రోధన గేహముట. సంసార చక్రంలో చిక్కి ముక్తి కోరుతున్న జీవుని బాధించే కామం. అది క్రోధానికి గృహమట. ఎంత బలమైనదో వివరించారు కూడా. అంతేనా పద్యం చివర భాగందాకా ఆగారు. అంతటి దానిని వదుల్చుకోవడానికి అంతులేని మానవ ప్రయత్నం, దేవ సహాయం రెండూ కావాలని సూచిస్తూ. కామానికి సంకేతం మకరం అని రూఢి చేయబడింది. ఇందుకే పోతనగారు భక్తిప్రపత్తి ముఖ్య మన్నది

96

ఇట్లు నిమిష స్పర్శనంబున సుదర్శనంబు మకరితలఁ ద్రుంచు నవసరంబున.

టీక:- ఇట్లు = ఈ విధముగ; నిమిష = కనురెప్పపాటు కాలపు; స్పర్శంబునన్ = తగులుటలోనే; సుదర్శనంబు = సుదర్శనచక్రము; మకరి = మొసలి యొక్క; తలన్ = శిరస్సును; త్రుంచు = ఖండించెడి; అవసరంబునన్ = సమయము నందు;

భావము:- ఇలా రెప్పపాటు కాలంలో మొసలి శిరస్సును సుదర్శన చక్రం ఖండించిన ఆ సమయంలో

97

మకర మొకటి రవిఁ జొచ్చెను;
మకరము మఱియొకటి ధనదు మాటున డాఁగెన్;
మకరాలయమునఁ దిరిగెఁడు
మకరంబులు కూర్మరాజు మఱువున కరిగెన్.

టీక:- మకరము = మకరరాశి {ద్వాదశరాశులు - 1మేషము 2వృషభము 3మిథునము 4కర్కాటకము 5సింహము 6కన్య 7తుల 8వృశ్చికము 9ధనుస్సు 10మకరము 11కుంభము 12మీనము}; ఒకటి = ఒకటి; రవిన్ = సూర్యుని, జాతక చక్రములో రవి స్థానమును; చొచ్చెన్ = చేరెను; మకరము = నవనిధులలోని మకరము {నవనిధులు - 1మహాపద్మము 2పద్మము 3శంఖము 4మకరము 5కచ్ఛపము 6ముకుందము 7కుందము 8నీలము 9వరము}; మఱియొకటి = ఇంకొకటి; ధనదు = కుబేరుని {ధనదుడు - ధనము నిచ్చువాడు, దాత, కుబేరుడు}; మాటున = రక్షణలో; డాగెన్ = దాగినది; మకరాలయమున్ = సముద్రు నందు {మకరాలయము - మొసళ్ళకు నిలయము, సముద్రము}; తిరిగెడు = సంచరించెడి; మకరంబులు = మొసళ్ళు; కూర్మరాజు = ఆదికూర్మము; మరువున్ = చాటున; కున్ = కు; అరిగెన్ = వెళ్ళెను.

భావము:- ద్వాదశరాశులలో ఉండే మకరం సూర్యుని చాటున నక్కింది. నవనిధులలో ఉండే మకరం కుబేరుని చాటున దాక్కుంది. సముద్రంలో ఉన్న మకరాలు ఆదికూర్మం చాటుకి చేరాయి.

(మకరం అంటే మొసలి. ఇలా మొసళ్ళు అన్ని బెదిరిపోడానికి కారణం భూలోకంలో ఒక మడుగులో ఉన్న గజేంద్రుని హరించ సిద్ధపడ్డ మకరం ఖండింపబడటం. విష్ణుమూర్తి

సుదర్శనచక్రం అంటే ఉన్న విశ్వవ్యాప్త భీతిని స్ఫురింపజేసినట్టి కవి చమత్కారం యిది. (1) ఆకాశంలో ఉన్న మకరం అంటే ఆకాశంలో (1మేషము 2వృషభము 3మిథునము 4కర్కాటకము 5సింహము 6కన్య 7తుల 8వృశ్చికము 9ధనుస్సు 10మకరము 11కుంభము 12మీనము అనబడే) ద్వాదశ రాసులు ఉన్నాయి కదా వాటిలోని మకరం, (2) పాతాళంలో ఉన్న మకరం అంటే కుబేరుని వద్ద (1మహాపద్మము 2పద్మము 3శంఖము 4మకరము 5కచ్ఛపము 6ముకుందము 7కుందము 8నీలము 9వరము అనబడే) నవనిధులు ఉన్నాయి కదా వాటిలోని మకరం. (3) సముద్రంలోని మకరాలు అంటే మొసళ్ళకి అదే కదా నివాసం. ఆ మకరాలన్నీ. ఇంకా సముద్ర మథన సమయంలో ఆది కూర్మం సముద్రంలోనే కదా అవతరించింది.)

98

త**మ**ముం బాసిన రోహిణీవిభు క్రియన్ దర్పించి సంసారదుః
ఖ**ము** వీడ్కొన్న విరక్తచిత్తుని గతిన్ గ్రాహంబు పట్టూడ్చి పా
ద**ము** లల్లార్చి కరేణుకావిభుఁడు సౌందర్యంబులో నొప్పె సం
భ్ర**మ**దాశాకరిణీ కరోజ్ఝిత సుధాంభస్స్నాన విశ్రాంతుఁడై.

టీక:- తమమున్ = చీకటిని; పాసిన = విడిచిన; రోహిణీవిభు = చంద్రుని {రోహిణీవిభుడు - రోహిణి (27 నక్షత్రములలోను ఒకటి, రోహిణి దక్షుడు చంద్రునికి ఇచ్చిన ఇరవైఏడుగురు పుత్రికలలో ఒకరు, చంద్ర కళలకు కారణం ఈమె అంటే చంద్రునికి గల బహు ప్రీతి అంటారు) యొక్క విభుడు, చంద్రుడు}; క్రియన్ = వలె; దర్పించి = అతిశయించి; సంసార = సంసారము నందలి; దుఃఖమున్ = దుఃఖమును; వీడ్కొన్న = విడిచిపెట్టిన; విరక్త = వైరాగ్యము చెందిన; చిత్తుని = మనసు గలవాని; గతిన్ = వలె; గ్రాహంబున్ = మొసలి యొక్క; పట్టున్ = పట్టును; ఊడ్చి = విడిపించుకొని; పాదములన్ = కాళ్ళను; అల్లార్చి = విదలించి; కరేణుకావిభుడు = గజేంద్రుడు {కరేణుకావిభుడు - కరేణుక (ఏనుగుల) విభుడు (ప్రభువు), గజేంద్రుడు}; సౌందర్యంబు = అందము; లోన్ = లోటి; ఒప్పెన్ = చక్కగా నుండెను; సంభ్రమత్ = సంతోషము కలిగిన; ఆశాకరణి = ఆడ దిగ్గజముల; కర = తొండములచే; ఉజ్ఝిత = పోసిన; సుధా = అమృతపు; అంభః = నీటి; స్నాన = స్నానమువలన; విశ్రాంతుడు = అలసటతీరిన వాడు; ఐ = అయ్యి.

భావము:- కారుచీకటి నుండి వెలువడిన చందమామ లాగ, సంసార బంధాల నుండి విడివడిన సన్యాసి లాగ, గజేంద్రుడు మొసలి పట్టు విడిపించుకొని ఉత్సాహంగా కాళ్ళు కదలించాడు. ఆదరంతో ఆడదిగ్గజాలు లాంటి ఆడ ఏనుగులు తొండాలతో పోసిన అమృత జలంలో స్నానం చేసి అలసట తీర్చుకొన్న వాడై గజేంద్రుడు గర్వించి చక్కదనాలతో చక్కగా ఉన్నాడు.
ఉత్తి విరక్తుడు కాదు సంసారదుఃఖము వీడ్కొన్న విరక్తచిత్తుడు అనడంతో గజేంద్రుడు ముముక్షువైన జీవుడు అని సంకేతం రూఢి అయింది గమనించారా.

99

పూరించెన్ హరి పాంచజన్యముఁ, గృపాంభోరాశి సౌజన్యమున్,
భూరిధ్వాన చలాచలీకృత మహాభూత ప్రచైతన్యమున్,
సారోదారసిత ప్రభాచకిత పర్జన్యాది రాజన్యమున్,
దూరీభూత విపన్నదైన్యమును, నిర్ధూతద్విషత్సైన్యమున్.

టీక:- పూరించెన్ = ఊదెను; హరి = విష్ణుమూర్తి {హరి - భక్తుల హృదయములను ఆకర్షించెడి వాడు, విష్ణువు}; పాంచజన్యమున్ = శంఖమును {పాంచజన్యము - విష్ణుమూర్తి యొక్క శంఖము}; కృపాంభోరాశి = దయాసముద్ర మంత; సౌజన్యమున్ = మంచితనము గలదానిని; భూరి = అత్యధికమైన {భూరి - సంఖ్యలలో మిక్కిలి పెద్దది, 1 తరువాత 35 సున్నాలు గలది భూరి 5 సున్నాలు ఉండెడిది లక్ష}; ధ్వాన = శబ్దముతో; చలాచలీకృత = మిక్కిలి చలింపజేయబడిన; మహాభూత = పృథ్వాదుల; ప్రచైతన్యమున్ = చేష్టలు గలదానిని; సార = సామర్థ్యముతో; ఉదార = గొప్పదైన; సిత = తెల్లని; ప్రభా = కాంతులలతో; చకిత = బెదిరిపోయెడి; పర్జన్య = ఇంద్రుడు; ఆది = మున్నగు; రాజన్యము = శ్రేష్ఠులు గలదానిని; దూరీభూత = దూరము చేయబడిన; విపన్న = దీనుల; దైన్యమున్ = దీనత్వము గలదానిని; నిర్ధూత = పారదోలబడిన; విషత్ = శత్రువుల; సైన్యమున్ = సైన్యములు గలదానిని.

భావము:- విష్ణుమూర్తి విజయసూచకంగా పాంచజన్య శంఖాన్ని ఊదాడు. ఆ శంఖం దయారసానికి సాగరం వంటిది. తన మహా గొప్పధ్వనితో పంచభూతాల మహా చైతన్యాన్ని పటాపంచలు చేసేది. అపారమైన శక్తిలో కూడిన తెల్లని కాంతితో ఇంద్రాది ప్రభువులకైన బెరకు పుట్టించేది. దీనుల దుఃఖాన్ని పోగొట్టేది. శత్రువుల సైన్యాలను పారదోలేది.

100

మ్రొరసెన్ నిర్జరదుందుభుల్; జలరుహామోదంబులై వాయువుల్
దిరిగెం; బువ్వులవానజల్లుఁ గురిసెన్; దేవాంగనాలాస్యముల్
పరఁగెన్; దిక్కులయందు జీవజయశబ్దధ్వానముల్ నిండె; సా
గర ముప్పొంగెఁ దరంగ చుంబిత నభోగంగాముఖాంభోజమై.

టీక:- మొరసెన్ = మోగినవి; నిర్జర = దేవతల; దుందుభుల్ = భేరీలు; జలరుహ = పద్మముల; ఆమోదంబులు = పరిమళములు గలవి; ఐ = అయ్యి; వాయువుల్ = గాలులు; తిరిగెన్ = వీచెను; పువ్వుల = పూల; వాన = వానల; జల్లున్ = జల్లులు; కురిసెన్ = కురిసినవి; దేవ = దేవతా; అంగనల = స్త్రీల; లాస్యముల్ = నాట్యములు; పరగెన్ = ఒప్పినవి; దిక్కుల = అన్నివైపుల; అందున్ = అందు; జీవ = సకలప్రాణుల; జయ = జయజయ యనెడి; శబ్ద = పలుకుల; ధ్వానముల్ = చప్పుళ్ళు; నిండెన్ = నిండినవి; సాగరమున్ = సముద్రము; ఉప్పొంగెన్ = ఉప్పొంగినది; తరంగ = అలలచేత; చుంబిత = ముద్దాడబడిన; నభో = ఆకాశ; గంగా = గంగ యొక్క; ముఖ = ముఖము యనెడి; అంభోజము = పద్మము గలది; ఐ = అయ్యి.

భావము:- శ్రీహరి పాంచజన్యం ధ్వనించగానే దేవతల దుందుభులు మోగాయి. పద్మాల సువాసనలతో కూడిన గాలులు వీచాయి. పూలవానలు కురిసాయి. దేవతా స్త్రీలు నాట్యాలు చేసారు. సకల ప్రాణుల జయజయధ్వానాలు నల్దిక్కుల వ్యాపించాయి. తన తరంగాలతో సముద్రుడు ఉప్పొంగి ఆకాశగంగ ముఖపద్మాన్ని ముద్దాడి ఆనందించాడు.

101

నిడుద యగు కేల గజమును
మడువున వెడలంగఁ దిగిచి మదజల రేఖల్
దుడుచుచు మెల్లన పుడుకుచు
నుడిపెన్ విష్ణుండు దుఃఖ ముర్వీనాథా!

టీక:- నిడుద = పొడవైనది; అగు = అయిన; కేలన్ = చేతితో; గజమును = ఏనుగును; మడువునన్ = మడుగునుండి; వెడలంగ = వెలువడునట్లు; తిగిచి = లాగి; మదజల = మదజలము యొక్క; రేఖల్ = ధారలను; తుడుచుచున్ = తుడుస్తూ; మెల్లన = మెల్లిగా; పుడుకుచు = నిమురుచు; ఉడిపెన్ = పోగొట్టెను; విష్ణుండు = హరి; దుఃఖమున్ =

దుఃఖమును; ఉర్వీనాథా = రాజా {ఉర్వీనాథుడు - ఉర్వి (భూమికి) నాథుడు (ప్రభువు), రాజు}.

భావము:- మహారాజా! విష్ణుమూర్తి తన పొడవైన చేతితో గజేంద్రుని సరస్సులోంచి బయటకు తీసుకొని వచ్చాడు. అతని మదజల ధారలు తుడిచాడు. మెల్లగా దువ్వుతు దుఃఖాన్ని పోగొట్టేడు.

102

శ్రీహరి కర సంస్పర్శను
దేహము దాహంబు మాని ధృతిఁ గరిణీసం
దోహంబుఁ దాను గజపతి
మోహన ఘీంకార శబ్దములతో నొప్పెన్.

టీక:- శ్రీహరి = నారాయణుడు; కర = చేతి యొక్క; సంస్పర్శను = చక్కటి స్పర్శవలన; దేహము = దేహము నందలి; దాహంబున్ = తాపము; మాని = తగ్గిపోయి; ధృతిన్ = సంతోషముతో; కరిణీ = ఆడ యేనుగులు; సందోహంబున్ = సమూహమును; తాను = అతను; గజపతి = గజేంద్రుడు; మోహన = సొంపైన; ఘీంకారముల్ = ఘీంకారముల {ఘీంకారము - ఏనుగు అరుపు}; శబ్దముల = నాదముల; తోన్ = తోటి; ఒప్పెన్ = ఒప్పియున్నది.

భావము:- విష్ణుమూర్తి చేతి స్పర్శ వల్ల గజేంద్రుని శరీరతాపం అంతా పోయింది. గజరాజు సంతోషంగా ఆడఏనుగుల సమూహంతో కలిసి చేస్తున్న ఘీంకర నాదాలతో సొంపుగా ఉన్నాడు.

103

కరమున మెల్లన నివురుచుఁ
గర మనురాగమున మెఱసి కలయం బడుచుం
గరి హరికతమున బ్రతికినఁ
గరపీడన మాచరించెఁ గరిణుల మరలన్.

టీక:- కరమున్ = తొండముచే; మెల్లన = మెల్లిగా; నివురుచు = సున్నితముగా రాస్తూ; కరము = అధికమైన; అనురాగమునన్ = ప్రేమతో; మెఱసి = అతిశయించి; కలయంబడుచున్ = చెర్లాడుతూ; కరి = ఏనుగు; హరి = విష్ణుమూర్తి; కతమునన్ =

వలన; బ్రతికినన్ = బతికి బయటపడిన వెనుక; కర = తొండములచే; పీడనము = తాకుట; ఆచరించెన్ = చేసినది; కరిణుల = ఆడ యేనుగులను; మరలన్ = మళ్ళీ.

భావము:- శ్రీహరి దయవల్ల బతికినట్టి గజేంద్రుడు, ఇదివరకు లానే తన ఆడ ఏనుగులను తన తొండంతో మెల్లగా తాకాడు. మళ్ళీ మిక్కిలి ప్రేమగా వాటి తొండాలను తన తొండంతో నొక్కాడు.

## గజేంద్రుని పూర్వజన్మ కథ

104

జననాథ! దేవలశాప విముక్తుఁడై;
పటుతర గ్రాహరూపంబు మాని
ఘనుఁడు హూహూ నామ గంధర్వుఁ డప్పుడు;
తన తొంటి నిర్మల తనువుఁ దాల్చి
హరికి నవ్యయునకు నతిభక్తితో మ్రొక్కి;
తవిలి కీర్తించి గీతములు పాడి
యాదేవు కృప నొంది యందంద మఱియును;
వినత శిరస్కుఁడై వేడ్కతోడ
దళిత పాపుఁ డగుచు దనలోకమున కేగె
నపుడు శౌరి కేల నంటి తడవ
హస్తి లోకనాథుఁ డజ్ఞాన రహితుఁడై
విష్ణురూపుఁ డగుచు వెలుఁగుచుండె.

టీక:- జననాథ = రాజా {జననాథుడు - జన (మానవులకు) నాథుడు, రాజు}; దేవల = దేవలుని (ముని); శాప = శాపమునుండి; విముక్తుడు = విడివడినవాడు; ఐ = అయ్యి; పటుతర = మిక్కిలి క్రూరమైన {పటు - పటుతరము - పటుతమము}; గ్రాహ = మొసలి యొక్క; రూపంబున్ = స్వరూపమును; మాని = వదలి; ఘనుడు = గొప్పవాడు; హూహూ = హూహూ యనెడి; నామ = పేరుగల; గంధర్వుడు = గంధర్వుడు; అప్పుడు = ఆ సమయములో; తన = తన యొక్క; తొంటి = పూర్వపు; నిర్మల = నిర్మలమైన; తనువున్ = దేహమును; తాల్చి = ధరించి; హరి = విష్ణుమూర్తి; కిన్ = కి; అవ్యయున్ = విష్ణుమూర్తి {అవ్యయుడు - నాశము లేనివాడు, విష్ణువు}; కున్ = కి; అతి = మిక్కిలి; భక్తి

= భక్తి; తోన్ = తోటి; మ్రొక్కి = నమస్కరించి; తవిలి = పూని; కీర్తించి = స్తోత్రముల చేసి; గీతములున్ = పాటలు; పాడి = పాడి; ఆ = ఆ; దేవున్ = భగవంతుని; కృపన్ = కరుణ; ఒంది = పొంది; అందంద = మరలమరల; మఱియునున్ = ఇంకను; వినత = మిక్కిలి వంచిన; శిరస్కుఁడు = తల గలవాడు; ఐ = అయ్యి; వేడ్క = వేడుక; తోడన్ = తోటి. దళిత = పోగొట్టబడిన; పాపుడు = పాపము గలవాడు; అగుచున్ = అగుచు; తన = తన యొక్క; లోకమున్ = లోకమున; కున్ = కు; ఏగెన్ = వెళ్ళిపోయెను; అపుడు = అంతట; శౌరి = నారాయణుడు; కేలన్ = చేతితో; అంటి = ముట్టుకొని; తడవన్ = నివురుటచే; హస్తిలోకనాథుడు = గజేంద్రుడు {హస్తిలోకనాథుడు - ఏనుగుల సమూహమునకు పతి, గజేంద్రుడు}; అజ్ఞాన = అజ్ఞానము; రహితుండు = తొలగినవాడు; ఐ = అయ్యి; విష్ణు = విష్ణుమూర్తి యొక్క; రూపుడు = సారూప్యము పొందినవాడు; అగుచున్ = అగుచు; వెలుగుచుండె = ప్రకాశించుచుండెను.

<u>భావము</u>:- పరీక్షిన్మహారాజా! అప్పుడు దేవల ముని పెట్టిన శాపం నుండి విముక్తి కావడంతో "హూహూ" అనే పేరు గల ఆ గంధర్వుడు ఆ కఠినమైన మొసలి రూపం విడిచిపెట్టేడు. తన పూర్వపు నిర్మల మైన రూపం ధరించాడు. మిక్కిలి భక్తితో విష్ణుమూర్తికి మొక్కి స్తోత్రాలు చేసి ఆ దేవదేవుని అనుగ్రహం పొందాడు. భక్తిగా వంచిన శిరస్సుతో మరల మరల నమస్కరిస్తు సంతోషంగా పుణ్యాత్ముడై గంధర్వ లోకానికి వెళ్ళిపోయాడు. అప్పుడు విష్ణుమూర్తి గజరాజును చేతితో దువ్వుటచే. వెంటనే గజరాజు అజ్ఞాన మంతా తొలగిపోయింది. అతను విష్ణుదేవుని సారూప్యం పొంది ప్రకాశించాడు.

105

**<u>అ</u>వ**నీనాథ! గజేంద్రుఁ డా మకరితో <u>నా</u>లంబుఁ గావించె మున్
<u>ద్ర</u>**వి**ళాధీశుఁ డతండు పుణ్యతముఁ డింద్రద్యుమ్న నాముండు వై
<u>ష్ణ</u>**వ**ముఖ్యుండు గృహీతమౌననియతిన్ <u>స</u>ర్వాత్ము నారాయణున్
<u>స</u>**వి**శేషంబుగఁ బూజ చేసెను మహాశైలాగ్రభాగంబునన్.

<u>టీక</u>:- అవనీనాథ = రాజా; గజేంద్రుడు = గజేంద్రుడు; ఆ = ఆ; మకరి = మొసలి; తోన్ = తోటి; ఆలంబున్ = యుద్ధమును; కావించె = చేసెను; మున్ = పూర్వము; ద్రవిళ = ద్రవిడదేశపు; అధీశుడు = ప్రభువు; అతండు = అతడు; పుణ్యతముడు = అత్యంతధిక మైన పుణ్యుడు; ఇంద్రద్యుమ్న = ఇంద్రద్యుమ్నుడు యనెడి; నాముండు = పేరు

గలవాడు; వైష్ణవ = విష్ణుభక్తులలో; ముఖ్యుండు = ముఖ్యమైనవాడు; గృహీత = స్వీకరించిన; మౌన = మౌనవ్రత; నియతిన్ = నియమముతో; సర్వాత్మున్ = హరిని {సర్వాత్ముడు - సర్వము తన రూపమే యైనవాడు, విష్ణువు}; నారాయణున్ = హరిని {నారాయణుడు - సారూప్యముక్తికి స్థానమైనవాడు, విష్ణువు}; సవిశేషంబుగన్ = విశిష్టతలతో కూడినట్లుగ; పూజ = పూజలు; చేసెను = చేసెను; మహా = గొప్ప; శైల = పర్వతము; అగ్ర = పై; భాగంబునన్ = ప్రదేశము నందు.

భావము:- రాజా! మొసలితో పోరాడిన ఆ గజరాజు పూర్వ జన్మలో ఇంద్రద్యుమ్నుడు అనే ద్రవిడ దేశపు మహారాజు. అతడు అతి శ్రేష్ఠమైన విష్ణు భక్తుడు. ఒక పెద్దపర్వతంమీద మౌనవ్రతం పూని సర్వాత్మ ఐన శ్రీహరిని గూర్చి విశేషమైన పూజలు జరిపేవాడు.

106

ఒకనాఁ డా నృపుఁ డచ్యుతున్ మనసులో నూహించుచున్ మౌనియై
యకలంకస్థితి నున్న చోఁ గలశజుం డచ్చోటికిన్ వచ్చి లే
వకపూజింపక యున్న మౌనిఁ గని నవ్యక్రోధుఁడై మూఢ! లు
బ్ధ!కరీంద్రోత్తమ యోనిఁ బుట్టు మని శాపంబిచ్చె భూవల్లభా!

టీక:- ఒక = ఒక; నాడున్ = దినమున; ఆ = ఆ; నృపుడు = రాజు {నృపుడు - నృ (నరులను) పతి, రాజు}; అచ్యుతున్ = నారాయణుని {అచ్యుతుడు - తన పదవినుండి భ్రంశము పొందని వాడు, విష్ణువు}; మనసు = మనస్సు; లోన్ = అందు; ఊహించుచున్ = భావించుకొనుచు; మౌని = మౌనము ధరించినవాడు; ఐ = అయ్యి; అకలంక = ఏకాగ్రచిత్తము గల; స్థితిన్ = స్థితిలో; ఉన్నచోన్ = ఉన్న సమయము నందు; కలశజుండు = అగస్త్యముని {కలశజుడు - కలశము నందు జుడు (పుట్టినవాడు), అగస్త్యుడు}; ఆ = ఆ; చోటి = ప్రదేశమున; కిన్ = కు; వచ్చి = వచ్చి; లేవక = లేవకుండగ; పూజింపకన్ = గౌరవించకుండగ; ఉన్న = ఉన్నట్టి; మౌనిన్ = మౌనము ధరించిన వానిని; కని = చూసి; నవ్య = వెంటనే పుట్టిన; క్రోధుడు = కోపము గలవాడు; ఐ = అయ్యి; మూఢ = మూర్ఖుడా; లుబ్ధ = లోభి, అనాగరికుడ; కరీంద్రము = మదగజములలో; ఉత్తమ = ఉత్తమ మైన; యోనిన్ = గర్భమున; పుట్టుము = జన్మించుము; అని = అని; శాపంబున్ = శాపమును; ఇచ్చెన్ = ఇచ్చెను; భూవల్లభా = రాజా {భూవల్లభుడు - భూ (భూమికి) వల్లభుడు (పతి), రాజు}.

భావము:- పరీక్షిన్మహారాజా! ఒక రోజు విష్ణుమూర్తిని మనసులో ధ్యానం చేస్తూ ఇంద్రద్యుమ్నుడు మౌనంగా ఏకాగ్రచిత్తంతోఉన్నాడు. అప్పుడు అక్కడకి అగస్త్య మహర్షి వచ్చాడు. రాజు తనను గౌరవించ లేదని. లేవకుండ మౌనంగా ఉన్నాడని ఆగ్రహించాడు “ఓరీ మూర్ఖుడా! పిసినిగొట్టు! ఏనుగు కడుపున జన్మించు.” అని అతనికి శాపమిచ్చాడు.

107

మునిపతి నవమానించిన
ఘనుఁడింద్రద్యుమ్న విభుఁడుఁ గౌంజరయోనిం
జననం బందెను విప్రులఁ
గనియవమానింపఁ దగదు ఘన పుణ్యులకున్.

టీక:- ముని = మునులలో; పతిన్ = ప్రభువుని; అవమానించిన = అవమానించి నట్టి; ఘనుడు = గొప్పవాడు; ఇంద్రద్యుమ్న = ఇంద్రద్యుమ్నుడు యనెడి; విభుడు = రాజు; కౌంజర = ఏనుగు యొక్క {కుంజరము – వ్యు. కుంజః (ప్రశస్తః) అస్తిఅస్య – కుంజ+రః, త.ప్ర., మేలైన దంతము చెక్కిలి పై భాగము కలది, ఏనుగు, ఆంధ్రశబ్దరత్నాకరము}; యోనిన్ = గర్భమున; జననంబున్ = జన్మమును; అందెను = పొందెను; విప్రులన్ = బ్రాహ్మణులను; కని = చూసి; అవమానింపన్ = అవమానించుట; తగదు = తగినపని కాదు; ఘన = గొప్ప; పుణ్యులకున్ = పుణ్యవంతుల కైనను.

భావము:- అగస్త్య మునీశ్వరుని అవమానించిన గొప్పవాడైనట్టి ఇంద్రద్యుమ్న మహారాజు ఏనుగుగా పుట్టాడు. అందుకే ఎంతటి గొప్ప పుణ్యాత్ములైనా సరే బ్రాహ్మణులను అవమానించరాదు.

108

కరినాథుఁ డయ్యె నాతఁడు
కరులైరి భటాదులెల్ల; గజముగ నయ్యున్
హరిచరణ సేవ కతమునఁ
గరివరునకు నధికముక్తిఁ గలిగె మహాత్మా!

టీక:- కరినాథుడు = గజేంద్రుడు; అయ్యెన్ = అయ్యెను; ఆతడు = అతడు; కరులు = ఏనుగులు; ఐరి = అయ్యారు; భట = భటులు; ఆదులు = మున్నగువారు; ఎల్లన్ = అందరును; గజముగన్ = గజమువలె; అయ్యున్ = అయినప్పటుకిని; హరి =

నారాయణుని; చరణ = పాదముల; సేవ = సేవించుట; కతమునన్ = కారణముచేత; కరి = ఏనుగు; వరున్ = ఉత్తమున; కున్ = కు; అధిక = గొప్ప; ముక్తి = ముక్తి; కలిగెన్ = కలిగినది; మహాత్మా = గొప్పవాడ.

భావము:- ఓ రాజేంద్ర! ఇంద్రద్యుమ్నుడు గజేంద్రుడుగా పుట్టాడు. అతని భటు లందరు ఏనుగులుగా పుట్టారు. ఏనుగుగా పుట్టినా కూడ అతనికి విష్ణుభక్తి వల్ల గొప్పదైన ముక్తి లభించింది.

109

కర్మతంత్రుఁ డగుచుఁ గమలాక్షుఁ గొల్చుచు
నుభయ నియతవృత్తి నుండెనేనిఁ
జెడును గర్మమెల్ల శిథిలమై మెల్లన
ప్రబలమైన విష్ణుభక్తి చెడదు.

టీక:- కర్మ = చేసిన కర్మలచే; తంత్రుడు = నడుపబడువాడు; అగుచున్ = అగుచు; కమలాక్షున్ = నారాయణుని; కొల్చుచున్ = సేవించుచు; ఉభయ = ఈ రెండు కార్యములు; నియత = నియమబద్ధమైన; వృత్తిని = విధముగ; ఉండెను = ఉన్నట్లు; ఏని = అయితే; చెడున్ = నశించును; కర్మము = కర్మఫలము; ఎల్లన్ = సమస్తమును; శిథిలము = కరిగిపోయినది; ఐ = అయ్యి; మెల్లన = మెల్లగా; ప్రబలమైన = శక్తివంతమైన; విష్ణు = విష్ణువు యందలి; భక్తి = భక్తి; చెడదు = నశించదు.

భావము:- భక్తుడు తన పనులు తను నిర్వర్తించాలి, విష్ణుమూర్తిని సేవించాలి. ఈ రెండు నియమాలు సక్రమంగా పాటిస్తే క్రమంగా అతని పాపా లన్నీ నశించిపోతాయి. మిక్కిలి బలవంత మైనట్టి విష్ణుభక్తి ఎప్పటికి నశించదు.

110

చెడుఁగరులు హరులు ధనములుఁ
జెడుదురు నిజసతులు సుతులుఁ జెడు చెనఁటులకుం;
జెడక మనునట్టి గుణులకుఁ
జెడని పదార్థములు విష్ణుసేవా నిరతుల్.

టీక:- చెడున్ = నశించును; కరులు = ఏనుగులు; హరులు = గుఱ్ఱములు; ధనములున్ = సంపదలు; చెడుదురు = చెడిపోవుదురు; నిజ = తన యొక్క; సతులు = భార్యలు;

సుతులున్ = పుత్రులు; చెడున్ = చెడిపోవును; చెనటుల్ = దుర్జనుల; కున్ = కు; చెడక = చెడిపోవక; మను = జీవించెడి; అట్టి = అటువంటి; గుణుల్ = గుణవంతుల; కున్ = కు; చెడని = చెడిపోని; పదార్థములు = వస్తుతతి; విష్ణు = నారాయణుని; సేవా = కొలిచెడి; నిరతుల్ = అభిలాషలు, ఆసక్తి.

భావము:- దుర్జనులకు వారి ఏనుగులు, గుఱ్ఱాలు, సంపదలు అన్ని నశించిపోతాయి. వారి ఆలుబిడ్డలు నశించిపోతారు. గుణవంతు లైన సజ్జనులు చెడకుండ బతుకుతారు. వారికి విష్ణుభక్తి మీది ఆసక్తి చెడదు.

## లక్ష్మీ నారాయణ సంభాషణ

**111**

అప్పుడు జగజ్జనకుండగు న ప్పరమేశ్వరుండు దరహసిత ముఖకమల యగు నక్కమల కిట్లనియె.

టీక:- అప్పుడు = ఆ సమయములో; జగత్ = భువనములకు; జనకుండు = సృష్టించినవాడు; అగు = అయిన; ఆ = ఆ; పరమేశ్వరుండు = విష్ణుమూర్తి; దరహసిత = చిరునవ్వు గల; ముఖ = ముఖము యనెడి; కమల = పద్మము గలది; అగు = ఐన; ఆ = ఆ; కమల = లక్ష్మీదేవి; కిన్ = కి; ఇట్లు = ఈ విధముగా; అనియె = పలికెను.

భావము:- గజేంద్రుని రక్షించాక లోకాలకు తండ్రి ఐన విష్ణుమూర్తి చిరునవ్వుతో ఉన్నట్టి లక్ష్మీదేవితో ఇలా అన్నాడు

**112**

"బా**లా!** నా వెనువెంటను
హే**లన్** వినువీధినుండి యేతెంచుచు నీ
చే**లాం**చలంబుఁ బట్టుట
కా**లో** నేమంటి నన్ను నంభోజముఖీ!

టీక:- బాలా = చిన్నదానా; నా = నా; వెనువెంటను = కూడా; హేలన్ = విలాసముగా; వినువీధిన్ = ఆకాశమార్గమున; నుండి = నుండి; ఏతెంచుచున్ = వచ్చుచు; నీ = నీ యొక్క; చేలాంచలమున్ = పమిటకొంగును; పట్టుట = పట్టుకొనుట; కున్ = కు; ఆలోన్ = దాని విషయమై; ఏమి = ఏమి; అంటి = అనుకొంటివి; నన్నున్ = నన్ను; అంభోజముఖీ = లక్ష్మీదేవి.

భావము:- "చిన్నదానా! పద్మముఖీ! ఆకాశమార్గంలో నా వెనకాతలే విలాసంగా వస్తూ, నేను నీ పైటకొంగు విడువకుండా పట్టుకొని ఉన్నందుకు నన్ను గురించి ఏమనుకొన్నావో ఏమిటో?

113

ఎఱుఁగుదు తెఱవా! యెప్పుడు
మఱవను సకలంబు నన్ను మఱచిన యెడలన్
మఱతు నని యెఱిఁగి మొఱఁగక
మఱవక మొఱ యిడిర యేని మఱి యన్యములన్."

టీక:- ఎఱుగుదు = తెలియుదు; తెఱవా = మగువా; ఎప్పుడున్ = ఎప్పుడును; మఱవను = మరచిపోను; సకలంబు = సమస్తమును; నన్నున్ = నన్ను; మఱచిన = మరచిపోయిన; ఎడలన్ = సమయములలో; మఱతున్ = మరచిపోదును; అని = అని; ఎఱిగి = తెలిసి; మొఱగక = వంచించకుండా; మఱవక = మరచిపోకుండగ; మొఱ = మొరపెట్టుకొనుట; ఇడిరి = చేసినట్లు; ఏని = అయితే; మఱి = మరి; అన్యములన్ = ఇతరములను.

భావము:- ఓ వనితా! ఇది నీకు తెలుసు కదా! తెలిసి ఇతరులకు మొరపెట్టకుండ గుర్తుపెట్టుకొని నన్ను వేడుకొన్న వారిని ఎవరిని ఎప్పుడు నేను విడువను. నన్ను విడిచిపెట్టిన వారిని నేను విడిచిపెడతాను."

114

అని పలికిన నరవిందమందిర యగు నయ్యిందిరాదేవి మందస్మితచంద్రికా సుందరవదనారవింద యగుచు ముకుందున కిట్లనియె.

టీక:- అని = అని; పలికిన = అనిన; అరవింద = పద్మము లందు; మందిర = నివాసము గలది; అగు = అయిన; ఆ = ఆ; ఇందిరాదేవి = లక్ష్మీదేవి; మందస్మిత = చిరునవ్వు యనెడి; చంద్రికా = వెన్నెలచే; సుందర = అందమైన; వదన = ముఖము యనెడి; అరవింద = పద్మము గలది; అగుచున్ = అగుచు; ముకుందున్ = నారాయణుని {ముకుందుడు - మోక్షమును ఇచ్చువాడు, విష్ణువు}; కున్ = కి; ఇట్లు = ఈ విధముగా; అనియె = పలికెను.

భావము:- శ్రీహరి మాటలు విని పద్మాలలో నివసించెడి ఆమె అయిన లక్ష్మీదేవి చిరునవ్వు చిందే ముఖపద్మంతో గోవిందుడితో ఇలా అంది.

115

"దేవా! దేవర యడుగులు
భావంబున నిలిపి కొలచు పని నా పని గా
కో వల్లభ! యే మనియెద
నీ వెంటను వచ్చుచుంటి నిఖిలాధిపతీ!

టీక:- దేవా = ప్రభూ; దేవర = ప్రభవు యొక్క; అడుగులు = పాదములను; భావంబునన్ = చిత్తము నందు; నిలిపి = ఉంచుకొని; కొలచు = సేవించెడి; పని = పని; నా = నా యొక్క; పని = బాధ్యత; కాకన్ = అయ్యుండగా; ఓ = ఓ; వల్లభ = స్వామీ; ఏమి = ఏమి; అనియెద = చెప్పను; నీ = నీ; వెంటన్ = కూడా; వచ్చుచున్ = వస్తూ; ఉంటి = ఉంటిని; నిఖిలాధిపతీ = హరీ {నిఖిలాధిపతి - నిఖిల (సమస్తమునకు) అధిపతి (ప్రభువు), విష్ణువు}.

భావము:- "ఓ దేవదేవా! సమస్తానికి ప్రభువా! ఓ నా స్వామీ! నీ పాదాలను మనస్సులో పెట్టుకొని పూజించడమే నా పని కదా. కనుక ఏమి అనుకోకుండానే నిన్ను అనుసరించి వస్తున్నాను.

116

దీనుల కుయ్యాలింపను
దీనుల రక్షింప మేలు దీవనఁ బొందన్
దీనావన! నీ కొప్పును.
దీనపరాధీన! దేవదేవ! మహేశా!

టీక:- దీనుల = దీనుల; కుయ్యి = మొర; ఆలింపను = వినుటకు; దీనులన్ = దీనులను; రక్షింపన్ = కాపాడుటకు; మేలు = మంచి; దీవెనన్ = దీవనలను; పొందన్ = అందుకొనుటకు; దీన = దీనులను; అవన = కాపాడువాడ; నీ = నీ; కున్ = కు; ఒప్పున్ = తగి యున్నవి; దీన = దీనులకు; పరాధీన = వశమైనవాడ; దేవదేవ = హరి; మహేశ = హరి.

భావము:- ఓ దేవాధిదేవ! ఓ మహాప్రభూ! దీనుల మొరలను దయతో వినటానికైనా, వారిని కాపాడటానికైనా, మంచి మంచి దీవెనకోలు అందుకోటానికైనా, దీనబంధు! దీనరక్షక! నీకే తగు నయ్యా."

117

అని మఱియును సముచిత సంభాషణంబుల నంకించుచున్న యప్పరమ వైష్ణవీరత్నంబును సాదర సరససల్లాప మందహాస పూర్వకంబుగా నాలింగనంబు గావించి సపరివారుండై గరుడ గంధర్వ సిద్ధ విబుధగణ జేగీయమానుండై గరుడారూఢుం డగుచు హరి నిజసదనంబునకుం జనియె" నని చెప్పి శుకయోగీంద్రుం డిట్లనియె.

టీక:- అని = అని; మఱియును = ఇంకను; సమ = చక్కగా; ఉచిత = తగిన; సంభాషణంబులన్ = పలుకులతో; అంకించుకొన్న = స్తుతించుతున్న; ఆ = ఆ; పరమ = అత్యుత్తమ; వైష్ణవి = విష్ణుభక్తులలో; రత్నంబును = రత్నమువంటి యామెను; సాదర = ఆదరపూర్వకముగా; సరస = ఇంపైన; సల్లాప = మంచిమాటలతో; మందహాస = చిరునవ్వులతో; పూర్వకంబుగాన్ = కూడినదిగా; ఆలింగనంబు = కౌగలించుకొనుట; కావించి = చేసి; సపరివారుండు = సేవకులతో కూడినవాడు; ఐ = అయ్యి; గరుడ = గరుడులు; గంధర్వ = గంధర్వులు; సిద్ధ = సిద్ధులు; విబుధ = దేవతా; గణ = సమూహములచే; జేగీయమానుండు = స్తుతింపబడుతున్నవాడు; ఐ = అయ్యి; గరుడ = గరుత్మంతుని; ఆరూఢుండు = ఎక్కినవాడు; అగుచున్ = అగుచు; హరి = నారాయణుడు; నిజ = తన యొక్క; సదనంబు = నివాసమున; కున్ = కు; చనియెన్ = వెళ్ళెను; అని = అని; చెప్పి = చెప్పి; శుక = శుకుడు యనెడి; యోగి = యోగులలో; ఇంద్రుండు = ఇంద్రుని వంటివాడు; ఇట్లు = ఈ విధముగా; అనియె = పలికెను.

భావము:- ఇలా చెప్పిన పిమ్మట లక్ష్మీదేవి తగిన పలుకులతో శ్రీహరిని స్తుతించింది. ఆయన ఆ పరమ భక్తురాలైన లక్ష్మిని చక్కటి మాటలు చిరునవ్వులతో కౌగలించుకొన్నాడు. గరుడులు గంధర్వులు, సిద్ధులు, దేవతలు జయజయధ్వానాలు చేసారు. గరుడవాహనం అధిరోహించాడు. పరివారసమేతంగా వైకుంఠానికి తరలి వెళ్ళాడు." అని చెప్పి శుకమహర్షి ఇలా చెప్పాడు.

## గజేంద్రమోక్షణ కథా ఫలస్సృతి

118

"నరనాథ! నీకును నాచేత వివరింపఁ;
బడిన యీ కృష్ణానుభావమైన
గజరాజమోక్షణకథ వినువారికి;
యశము లిచ్చును గల్మషాపహంబు;
దుస్స్వప్న నాశంబు దుఃఖ సంహారంబుఁ;
బ్రొద్దున మేల్కాంచి పూతవృత్తి
నిత్యంబుఁ బఠియించు నిర్మలాత్మకులైన;
విప్రులకును బహువిభవ మమరు;
సంపదలు గల్గుఁ; బీడలు శాంతిఁ బొందు;
సుఖము సిద్ధించు; వర్ధిల్లు శోభనములు;
మోక్ష మఱచేతిదై యుండు; ముదము చేరు"
ననుచు విష్ణుండు ప్రీతుఁడై యానతిచ్చె.

టీక:- నరనాథ = రాజా {నరనాథుడు - నరులకు పతి, విష్ణువు}; నీ = నీ; కునున్ = కు; నా = నా; చేతన్ = వలన; వివరింపబడిన = వివరముగా తెలుపబడిన; ఈ = ఈ; కృష్ణా = శ్రీకృష్ణుని యొక్క; అనుభావము = ప్రభావము తెలుపునది; ఐన = అయిన; గజరాజ = గజేంద్రుని; మోక్షణ = మోక్షము యనెడి; కథ = కథను; విను = వినెడి; వారి = వారి; కిన్ = కి; యశములున్ = కీర్తులను; ఇచ్చునున్ = ఇచ్చును; కల్మష = పాపములను; అపహంబున్ = పరిహరించును; దుస్వప్న = చెడ్డకలలను; నాశంబున్ = తొలగించును; దుఃఖ = దుఃఖమును; సంహారంబున్ = నాశనము చేయును; ప్రొద్దున = ఉదయమే; మేల్కాంచి = నిద్రలేచి; పూత = పవిత్రమైన; వృత్తిన్ = విధముగ; నిత్యంబున్ = ప్రతిదినము; పఠియించు = చదివెడి; నిర్మల = నిర్మలమైన; ఆత్మకులు = మనసులు గలవారు; ఐన = అయిన; విప్రుల్ = బ్రాహ్మణుల; కునున్ = కు; బహు = అనేకమైన; విభవము = వైభవములు; అమరున్ = సమకూర్చును.
సంపదలున్ = సంపదలుకూడ; కల్గున్ = కలుగును; పీడలు = ఆపదలు; శాంతిన్ = సమసిపోవుట; పొందున్ = కలుగును; సుఖమున్ = సౌఖ్యములును; సిద్ధించున్ = కలుగును; వర్ధిల్లున్ = వృద్ధిచెందును; శోభనములు = శుభములు; మోక్షమున్ = ముక్తికూడ; అఱచేతిది = మిక్కిలి సులువైనది; ఐ = అయ్యి; ఉండున్ = ఉండును;

ముదము = సంతోషము; చేరున్ = సమకూరును; అనుచున్ = అని; విష్ణుండు = హరి; ప్రీతుండు = సంతుష్టుండు; ఐ = అయ్యి; ఆనతిచ్చెన్ = సెలవిచ్చెను.

భావము:- "ఓ మహారాజా! నీకు నేను వివరించిన విష్ణు మహిమతో కూడిన గజేంద్రమోక్షం అనే ఈ కథ వినెడివారి కీర్తి వృద్ధి చెందుతుంది. పాపాలు పరిహారమౌతాయి. చెడ్డకలలు తొలగి పోతాయి. కష్టాలు దూరమౌతాయి ప్రతిరోజు ఉదయమే లేచి పవిత్రంగా నియమంగా పారాయణగా చదివెడి నిర్మలమైన మనస్సు గల బ్రాహ్మణులకు అనేక రకాలైన వైభవాలు గొప్ప సంపదలు సమకూరుతాయి. ఆపదలు అంతరిస్తాయి. సౌఖ్యాలు దరిజేరతాయి. శుభాలు వృద్ధిచెందుతాయి. మోక్షం సులభ మౌతుంది. సంతోషాలు సమకూరతాయి." అని ఆనందంగా విష్ణుమూర్తి చెప్పాడు.

119

అని మఱియు నప్పరమేశ్వరుం డిట్లని యానతిచ్చె "ఎవ్వరేని నపర రాత్రాంతంబున మేల్కాంచి సమాహిత మనస్కులయి నన్నును; నిన్నును; నీ సరోవరంబును; శ్వేతద్వీపంబును; నాకుం బ్రియంబైన సుధాసాగరంబును; హేమనగంబును; నిగ్గిరి కందర కాననంబులను; వేత్ర కీచక వేణు లతాగుల్మ సురపాదపంబులను; నేనును బ్రహ్మయు ఫాలలోచనుండును నివసించి యుండు నక్కొండ శిఖరంబులను; గౌమోదకీ కౌస్తుభ సుదర్శన పాంచజన్యంబులను; శ్రీదేవిని; శేష గరుడ వాసుకి ప్రహ్లాద నారదులను; మత్స్య కూర్మ వరాహాద్యవతారంబులను; దదవతారకృత కార్యంబులను; సూర్య సోమ పావకులను; బ్రణవంబును; ధర్మతపస్సత్యంబులను; వేదంబును; వేదాంగంబులను శాస్త్రంబులను; గో భూసుర సాధు పతివ్రతా జనంబులను; జంద్ర కాశ్యపజాయా సముదయంబును; గౌరీ గంగా సరస్వతీ కాళిందీ సునందా ప్రముఖ పుణ్యతరంగిణీ నిచయంబును; నమరులను; నమరతరువులను; నైరావతంబును; నమృతంబును; ధ్రువుని; బ్రహ్మర్షి నివహంబును; బుణ్యశ్లోకులైన మానవులను; సమాహితచిత్తులై తలంచువారలకుఁ బ్రాణావసానకాలంబున మదీయంబగు విమలగతి నిత్తు" నని హృషీకేశుండు నిర్దేశించి శంఖంబు పూరించి సకలామర వందితచరణారవిందుఁడై విహగపరివృఢ వాహనుండై వేంచేసె; విబుధానీకంబు సంతోషించె" నని చెప్పి శుకుండు రాజున కిట్లనియె.

టీక:- అని = అని; మఱియున్ = ఇంకను; ఆ = ఆ; పరమేశ్వరుండు = విష్ణుమూర్తి; ఇట్లు = ఈ విధముగా; అని = చెప్పి; ఆనతిచ్చెన్ = సెలవిచ్చెను; ఎవ్వరు = ఎవరు; ఏనిన్ = అయినను; అపరరాత్రాంతంబున = తెల్లవారుఝాముననే; మేల్కాంచి = నిద్రలేచి; సమాహిత = ప్రశాంతమైన; మనస్కులు = మనసు గలవారు; ఐ = అయ్యి; నన్నున్ = నన్ను; నిన్నున్ = నిన్ను; ఈ = ఈ; సరోవరంబును = మడుగును; శ్వేతద్వీపంబును = శ్వేతద్వీపమును; నా = నా; కున్ = కు; ప్రియంబున్ = ఇష్టమైనది; ఐన = అయిన; సుధాసాగరంబును = పాలసముద్రమును; హేమనగంబును = మేరుపర్వతమును; ఈ = ఈ; గిరి = పర్వతము యొక్క; కందర = గుహలను; కాననంబులును = అడవులను; వేత్ర = పేము; కీచక = బొంగువెదురు; వేణు = వెదురు; లతా = లతలు; గుల్మ = పొదలు; సురపాదపంబులను = కల్పవృక్షములను; నేనునున్ = నేను (విష్ణువు); బ్రహ్మయున్ = బ్రహ్మదేవుడు; ఫాలలోచనుండును = పరమశివుడు; నివసించి = నివాసము; ఉండు = ఉండెడి; ఆ = ఆ; కొండ = పర్వతము (త్రికూటపర్వతము) యొక్క; శిఖరంబులను = శిఖరములను; కౌమోదకీ = కౌమోదకీ గదను; కౌస్తుభ = కౌస్తుభ మణిని; సుదర్శన = సుదర్శన చక్రమును; పాంచజన్యంబులను = పాంచజన్య శంఖమును; శ్రీదేవిని = లక్ష్మీదేవిని; శేష = ఆదిశేషుని; గరుడ = గరుత్మంతుని; వాసుకిన్ = వాసుకిని; ప్రహ్లాద = ప్రహ్లాదుని; నారదులను = నారదుని; మత్స్య = మత్స్య; కూర్మ = కూర్మ; వరాహ = వరాహ; ఆది = మొదలగు; అవతారంబులను = అవతారములను; తత్ = ఆయా; అవతార = అవతారములలో; కృత = చేసినట్టి; కార్యంబులను = పనులను; సూర్య = సూర్యుని; సోమ = చంద్రుని; పావకులను = అగ్నిదేవుని; ప్రణవంబును = ఓంకారమును; ధర్మ = ధర్మమును; తపస్ = తపస్సును; సత్యంబులను = సత్యములను; వేదంబును = వేదములను; వేదాంగంబులను = వేదాంగములను {వేదాంగములు = శిక్ష, ఛందస్సు, వ్యాకరణము, విరుక్తము, జ్యోతిషము, కల్పము మున్నగునవి}; శాస్త్రంబులను = శాస్త్రములను; గో = గోవులను; భూసుర = బ్రాహ్మణుల; సాధు = సాధువులను; పతివ్రతా = పతివ్రతలైన; జనంబులను = వారిని; చంద్ర = చంద్రుని యొక్క; కాశ్యప = కశ్యపుని యొక్క {కాశ్యపుడు – కశ్యపునికి సంబంధించినవాడు, కశ్యప ప్రజాపతి వంశంలో ఉలూక మహర్షికి పుత్రునిగా జన్మించినవాడు, ఔలూక్యుడు, కణాద మహర్షి, అణుసిద్ధాంతం కార్యకారణ సిద్ధాంతం వంటి అత్యుద్భుతమైన ప్రతిపాదించిన మహానుభావుడు}; జాయా =

భార్యల; సముదయంబును = సమూహములను; గౌరీ = గౌరీ; గంగా = గంగా; సరస్వతీ = సరస్వతీ; కాళిందీ = కాళిందీ; సునందా = సునందా; ప్రముఖ = మున్నగు; పుణ్య = పుణ్య; తరంగిణీ = నదుల; నిచయంబును = సమూహమును; అమరులను = దేవతలను; అమరతరువులను = దేవతావృక్షములను; ఐరావతంబును = ఐరావతమును; అమృతంబును = అమృతమును; ధ్రువుని = ధ్రువుని; బ్రహ్మర్షి = బ్రహ్మర్షుల; నివహంబును = సమూహమును; పుణ్య = పుణ్యులచే; శ్లోకులు = కీర్తించబడిన; ఐన = అయిన; మానవులను = నరులను; సమాహిత = ప్రశాంతమైన; చిత్తులు = మనసు గలవారు; ఐ = అయ్యి; తలంచు = తలచెడి; వారల = వారల; కున్ = కు; ప్రాణావసాన = చనిపోవు; కాలంబునన్ = సమయములో; మదీయంబు = నాది; అగు = ఐన; విమల = నిర్మలమైన; గతిన్ = పదమును; ఇత్తును = ఇచ్చెదను; అని = అని; హృషీకేశుండు = విష్ణుమూర్తి {హృషీకేశుడు - హృషీకముల (ఇంద్రియముల) కు ఈశుడు (ప్రభువు), విష్ణువు}; నిర్దేశించి = నిర్ణయించి; శంఖంబున్ = శంఖమును; పూరించి = ఊది; సకల = సర్వ; అమర = దేవతలచేత; వందిత = నమస్కరింపబడిన; చరణ = పాదము లనెడి; అరవిందుడు = పద్మములు గలవాడు; ఐ = అయ్యి; విహగపరివృఢ = గరుత్మంతుని {విహగపరివృఢుడు - విహగ (ఆకాశమున విహరించునవానికి అనగా పక్షులకు) పరివృఢుడు (ప్రభువు), గరుత్మంతుడు}; వాహనుండు = అధిరోహించినవాడు; ఐ = అయ్యి; వేంచేసెన్ = పయనించెను; విబుధ = దేవతల; అనీకంబు = సమూహము; సంతోషించెను = సంతోషించెను; అని = అని; చెప్పి = చెప్పి; శుకుండు = శుకుడు; రాజున్ = రాజున; కున్ = కు; ఇట్లు = ఈ విధముగా; అనియె = పలికెను.

<u>భావము</u>:- ఈ విధంగా చెప్పి శ్రీహరి ఇంకా ఇలా అన్నాడు “తెల్లవారగట్లనే నిద్రలేచి ప్రశాంతమైన మనస్సులో విష్ణుమూర్తిని, గజేంద్రుడిని, ఆ పద్మసరస్సును, శ్వేతద్వీపాన్ని, పాలసముద్రాన్ని, త్రికూట పర్వతం లోని గుహలను, అడవులను, పేము వెదురు పొదలు కల్ప వృక్షాలను, బ్రహ్మవిష్ణుమహేశ్వరులు నివసించే ఆ త్రికూట పర్వత శిఖరాలను, కౌమోదకీ గదను, కౌస్తుభ మణిని, సుదర్శన చక్రాన్ని, పాంచజన్య శంఖాన్ని, లక్ష్మీదేవిని, ఆది శేషుడుని, గరుత్మంతుడుని, వాసుకిని, ప్రహ్లాదుడుని, నారదుడుని, మత్స్య కూర్మ వరాహ మొదలైన అవతారాలని. ఆ యా అవతారాలలో చేసిన కృత్యాలను, సూర్యుడు

చంద్రుడు అగ్నులను, ఓంకారాన్ని, ధర్మం తపస్సు సత్యాలను, వేదాన్ని, వేదాంగాలను, శాస్త్రాలను, గోవులు బ్రాహ్మణులు సాధువులు పతివ్రతలను, చంద్రుడి భార్యలను (దక్షపుత్రికలు నక్షత్రాలు అయిన అశ్వని, భరణి మున్నగువారు ఇరవైఏడు (27) మంది), కశ్యపుడి భార్యలను (అదితి దితి మున్నగు వారు పదిహేనుమండి వారిలో దక్షపుత్రికలు పదముగ్గురు (13) వైశ్వానరుని కుమార్తెలు ఇద్దరు (2)), గంగ గౌరి సరస్వతి యమున సునంద మొదలైన పుణ్యనదులను, దేవతలను, దేవతా వృక్షాలను, ఐరావతాన్ని, అమృతాన్ని, ధ్రువుడుని, బ్రహ్మర్షులను, పుణ్యాత్ములైన మానవులను, ఏకాగ్ర చిత్తులై తలంచేవారికి విష్ణువునకు చెందిన నిర్మలమైన పదం చనిపోయే సమయంలో అనుగ్రహిస్తాను." ఇలా చెప్పి విష్ణువు శంఖాన్ని పూరించాడు. దేవతలు అందరు ఆయన పాదపద్మా లకు నమస్కారాలు చేసారు. శ్రీహరి గరుడుని అధిరోహించి పయనమయ్యాడు. దేవతలు సంతోషించారు." అని చెప్పి శుకబ్రహ్మ పరీక్షిత్తుతో ఇంకా ఇలా అన్నాడు.

120

"గజరాజమోక్షణంబును
నిజముగఁ బఠియించునట్టి నియతాత్ములకున్
గజరాజ వరదుఁ డిచ్చును
గజ తురగస్యందనములుఁ గైవల్యంబున్.

టీక:- గజరాజ = గజేంద్రుని; మోక్షణంబును = మోక్షమును; నిజముగ = సత్యముగ; పఠియించు = చదివెడి; అట్టి = అటువంటి; నియత = నియమపాలన గల; ఆత్ముల్ = వారి; కున్ = కి; గజరాజ = గజేంద్రునికి; వరదుడు = వరముల నిచ్చినవాడు; ఇచ్చును = ఇచ్చును; గజ = ఏనుగులను; తురగ = గుఱ్ఱములను; స్యందనములున్ = రథములను; కైవల్యంబున్ = మోక్షమును {కైవల్యము - కేవలము తానే హరి యగుట, మోక్షము}.

భావము:- గజేంద్రమోక్షం కథను భక్తితో నియమంగా చదివేవారికి గజేంద్రుడిని రక్షించిన శ్రీమహావిష్ణువు ఇహలోక వైభవాలను (ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు) మరియు పరలోక సౌఖ్యాన్ని (మోక్షాన్ని) అనుగ్రహిస్తాడు.

పూర్ణి

దివిజరిపువిదారీ! దేవలోకోపకారీ!
భువనభరనివారీ! పుణ్యరక్షానుసారీ!
ప్రవిమలశుభమూర్తీ! బంధుపోషప్రవర్తీ!
ధవళబహుళకీర్తీ! ధర్మనిత్యానువర్తీ!

టీక:- దివిజరిపువిదారీ = శ్రీరామా {దివిజరిపువిదారుడు - దివిజరిపు (రాక్షసు)లను విదారుడు (సంహరించినవాడు), శ్రీరాముడు}; దేవలోకోపకారీ = శ్రీరామా {దేవలోకోపకారుడు - దేవలోక (దేవతందరికి) ఉపకారుడు (ఉపకారము చేయువాడు), శ్రీరాముడు}; భువనభరనివారీ = శ్రీరామా {భువనభరనివారుడు - భూభారమును నివారించెడివాడు, శ్రీరాముడు}; పుణ్యరక్షానుసారీ = శ్రీరామా {పుణ్యరక్షానుసారుడు - పుణ్యాత్ములను కాపాడెడివాడు, శ్రీరాముడు}; ప్రవిమలశుభమూర్తీ = శ్రీరామా {ప్రవిమలశుభమూర్తి - మిక్కిలి నిర్మలమైన శుభకరమైన రూపము కలవాడు, శ్రీరాముడు}; బంధుపోషప్రవర్తీ = శ్రీరామా {బంధుపోషప్రవర్తి - ఆత్మీయులను పోషించెడి వాడు, శ్రీరాముడు}; ధవళబహుళకీర్తీ = శ్రీరామా {ధవళబహుళకీర్తి - స్వచ్ఛమైన గొప్ప కీర్తి కలవాడు, శ్రీరాముడు}; ధర్మనిత్యానువర్తీ = శ్రీరామా {ధర్మనిత్యానువర్తి - ధర్మమును ఎల్లప్పుడు ఆచరించు వాడు, శ్రీరాముడు}.

భావము:- దేవతల శత్రువులు అయిన రాక్షసులను తెగటార్చినవాడా! దేవతలకు మేలుచేసినవాడా! భూభారమును నివారించినవాడా! పుణ్యాత్ములను రక్షించేవాడా! నిర్మలమైన శుభకరమైన రూపం కలవాడా! ఆత్మీయులను పోషించేవాడా! స్వచ్ఛమైన గొప్పకీర్తి కలవాడా! ఎల్లప్పుడూ ధర్మాన్ని ఆదరించేవాడా! శ్రీరామా!

ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగవత పురాణం బను మహాప్రబంధంబు నందు గజేంద్రమోక్షణ కథా ప్రారంభము, త్రికూటపర్వత వర్ణన, త్రికూట మందలి గజములు, గజేంద్రుని వర్ణన, గజేంద్రుని కొలను ప్రవేశము, కరి మకరుల యుద్ధము, గజేంద్రుని దీనాలాపములు, విష్ణువు ఆగమనము, గజేంద్ర రక్షణము, గజేంద్రుని పూర్వజన్మ కథ, లక్ష్మీ నారాయణ సంభాషణ, గజేంద్రమోక్షణ కథా ఫలస్మృతి యను కథలుఁ గల గజేంద్రమోక్షణోపాఖ్యానము.

టీక:- ఇది = ఇది; శ్రీ = శుభకరుడైన; పరమేశ్వర = పరమశివుని; కరుణా = దయవలన; కలిత = జన్మించిన; కవితా = కవిత్వముచెప్పుటలో; విచిత్ర = అద్భుతమైనవాడు; కేసనమంత్రి = కేసనమంత్రి యొక్క; పుత్ర = కుమారుడు; సహజ = స్వభావ సిద్ధముగా; పాండిత్య = పాండిత్యము కలవాడు; పోతన = పోతన యనెడి; అమాత్య = ప్రెగ్గడచేత; ప్రణీతంబు = సంస్కరింపబడినది; అయిన = ఐన; శ్రీ = శుకరమైన; మహాభాగవతంబు = మహాభాగవతము; అను = అనెడి; మహా = గొప్ప; ప్రబంధంబున్ = గొప్ప గ్రంథము; అందున్ = లోని; గజేంద్ర = ఏనుగుల రాజు; మోక్షణ = ముక్తి పొందుట అను; కథా = ఉపాఖ్యానము; ప్రారంభము = మొదలు; త్రికూటపర్వత = త్రికూటము అనెడి పెద్ద కొండను; వర్ణన = వర్ణించుట; త్రికూట = త్రికటపర్వతము; అందలి = లోని; గజములు = ఏనుగులు; గజేంద్రుని = ఏనుగుల రాజును; వర్ణన = వర్ణించుట; గజేంద్రుని = ఏనుగుల రాజు; కొలను = చెరువు లోనికి; ప్రవేశము = దిగుట; కరి = ఏనుగు; మకరుల = మొసలి యొక్క; యుద్ధము = పోరు; గజేంద్రుని = ఏనుగుల పాజు; దీనాలాపములు = మొరపెట్టుకొనుటలు; విష్ణువు = హరి; ఆగమనము = వచ్చుట; గజేంద్ర = ఏనుగుల రాజును; రక్షణము =

రక్షించుట; గజేంద్రుని = ఏనుగుల రాజు యొక్క; పూర్వజన్మ = ముందటి పుట్టుక; కథ = వృత్తాంతము; లక్ష్మీ = లక్ష్మీదేవి; నారాయణ = విష్ణువు యొక్క; సంభాషణ = సంభాషణలు; గజేంద్ర = ఏనుగుల రాజుకు; మోక్షణ = ముక్తి లభించుట అను; కథా = వృత్తాంతము యొక్క; ఫలసృతి = నిర్ణయించిన ఫలితము; అను = అనెడి; కథలు = కథలు; కల = కలిగిన; శ్రీ = శ్రీమంతమైన; గజేంద్ర = గజేంద్రునికి; మోక్షణ = ముక్తి లభించుట అను; ఉపాఖ్యానము = వృత్తాంతము.

భావము:- ఇది పరమశివుని దయవల్ల కలిగిన కవితాసౌందర్యం కలవాడూ కేశనమంత్రి పుత్రుడూ సహజపాండిత్యుడూ అయిన పోతనామాత్యుడు రచించిన శ్రీమహాభాగవత పురాణం అనే మహాకావ్యంలోని అష్టమస్కంధంలోని గజేంద్రునికి ముక్తి లభించుట అను ఉపాఖ్యానము ప్రవేశిక, త్రికూటపర్వతము యొక్క వర్ణన, త్రికూటపర్వతము లోని ఏనుగులు, గజేంద్రుని వర్ణించుట, గజేంద్రుడు చెరువులోనికి దిగుట, ఏనుగు మొసలి పోరాటము, గజేంద్రుడు పెట్టుకున్న మొరలు, విష్ణుమూర్తి విచ్చేయుట, గజేంద్రుని రక్షించుట, గజేంద్రుని పూర్వజన్మ వృత్తాంతము, లక్ష్మీ నారాయణుల సంభాషణ, గజేంద్రునికి ముక్తి లభించుట అని కథ వలని లభించు ఫలితము అనే కథలు గల శ్రీ గజేంద్ర మోక్షణము అను ఉపాఖ్యానము సమాప్తము.

ఓం ఓం ఓం

ఓం శాంతిః శాంతిః శాంతిః

సర్వే జనాః సుఖినో భవంతు

---